# ★ కవికుమార్ ★

మొదటి భాగము



ప్రకాశకులు :

మాదిరెడ్డి జగన్నాథరావు అండ్ కో.,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు, కాకినాడ.

# కవికుమార్

(సాంఘిక నవల)

మొదటిభాగం



"కావ్యశ్రీ"
గుండాబత్తుల నారాయణరావు,
చల్లపల్లి.

ప్రథమ ముద్రణము

1000 కాపీలు

మూల్యము 8 అణాలు

పబ్లిషర్స్:

మాదిరెడ్డి జగన్నాధరావు అండ్ కో.,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,

కాకినాడ.



వికృతి

శ్రావణమాసము

1950

శ్రీ భుజంగరాడ్ ముద్రాక్షరశాల,

జగన్నాధపురం, కాకినాడ.

# "కవికుమార్"

ఒక విషయం—

## పరిచయం:—

ప్రపంచంలో-శాంతి సత్య ప్రణయస్వరూపిణియైన ప్రకృతికి;— నిరంతర దురంతర దుర్భర దౌర్జన్యస్వరూపిణియైన వికృతికి- హోరాహోరిగ జరిగేపోరులో- యెన్నోసుందుప్రాణాలు, పొగిలి, పగిలి— నలిగి, తొలగి-కృంగి-కృశించి-నశించి నాశనమైపోతూవుంటాయి—.

అయితే ప్రకృతిని నమ్ముకొన్నవారికి ప్రమోదము- వికృతిని నమ్మినవారికి విఘాతము సిద్ధిస్తాయన్నమాట నిర్వివాదాంశము—.

ప్రణయాన్ని ఆరాధించే ప్రేమమూర్తులు, నాయికానాయకులు- కుమారులు-

## అయితే—

సుగంధ మరంద మాధురీ మంజుల ప్రణయ మంజూషయైన శేష— తనదు వినూత్న భావకవితారస సాంద్రనిస్తంద్ర చంద్రికావనధి తరంగమాలి కాడోలికల తేలి-తూగుటుయ్యాలలూగే కవికుమారుడు- అన్నా విషయం- ఇందులో తేలుతుంది—

నవలకు మీకు మధ్య నేనెందుకు? వస్తాను—సెలవు.

"కావ్యశ్రీ"

ఇట్లు "కావ్యశ్రీ"

ఇది నా మిత్త్రుడు సుహృదయుడు
నా సహపాఠకుండు అగు
శ్రీ బోణం వెంకటరామదాసునకు
నా ప్రేమపూర్వకమైన అంకితం.

ఇట్లు,
" కావ్య శ్రీ "
గుండాబత్తుల నారాయణరావు,
చల్లపల్లి.

# 1

"ధరణి చలించె ప్రాణములు దక్కవు నీకిరణాలవాడి..."

"ఆ! చాల్లేవోయ్! ఇక నీకవిత్వం కట్టిపెట్టి మనం వచ్చిన పని చూడు త్వరగా"

"అబ్బా ఇంత మండుటెండలో ఏలారా తిరగడం?"

"మరి అలా అనుకుంటే యింకేలా? స్కూలు తెరచి అప్పుడే వారంరోజు లయ్యాయి. ఇంకా మనకు రూమ్ దొరకలేదు. తొందరగా చూసుకోకపోతే అసలు దొరకదు." అని మాట్లాడుకుంటూ స్కూల్ ఫైనల్ విద్యార్థులు వేణుగోపాలం, కుమార్ ఒకవీధిలో నడుస్తున్నారు. వేణు చటుక్కున ఆగి—

"కుమార్ చూడు ఆ పెంకుటింటిలో వున్నాయిట, రెండు గదులు. అవి యిస్తారట."

"అందులో హెల్తు ఇనస్పెక్టరున్నాడనుకుంటాను."

"కాదులేమరి. ఈమధ్యనే మా ఊరివాళ్లొకరు ఆ ఇల్లు కొనుక్కొని అందులోనికి వచ్చేశారు."

ఇంతలో అప్రయత్నంగా కుమార్ కళ్లు ఆ వీధిగుమ్మంలో వయ్యారంగా నిలుచుని మరునితూపుల్లాగ వాడిచూపులువిసరే తరుణి పైకి కుప్పించేయి.

"వేణూ! చూడరా! పలుకుల కందరాని యొక భామిని గుమ్మమునందు నిల్చి, తా కులుకు వసంతకాల మదకోయిలకంఠము రిత్తవోవ – నా చెలువ..."

"అబ్బా! నీమాయదారికవిత్వంతో వేగలేకుండావున్నాను. ఆకు కదిలితే ఆయాసపడతావు. చిలక పలికితే వలచి పిలిచింది అంటావు. కోయిల కూస్తే కొంటికేక అంటావు. ఏలాగ నీతో

నుండేది? నీకవిశ్వాసముంటే తరువాతసూర్యాస్తామయముగాని ముందు మనం వచ్చినపని మాత్రం ... ... ..."

"అయితే ఆ అమ్మాయి ఎవరు?"

"ఆయింటిలోనివారే!"

"పేరు తెలుసా?"

"నాకు తెలియదు."

"కోప్పడకురా వేణు"

"కోపం కాదురా! నీతో యెప్పుడూ ఇంతే! ఇంత యెండలో మనకు ఇవా మాటలు."

"పోనీ నీడకు వెళదామా?"

"గదివిషయం తేల్చుకుంటే అటుపైన యెక్కడకైనా వెళ్ళ వచ్చు..."

"అయితే కనుక్కోరాదూమరి-"

"నేను కాదు. ఆమేష్టారుదగ్గరకు నీవే వెళ్ళిరా."

"మేష్టా రెవరు?"

"ఆ అమ్మాయి మేనమామ"

"తండ్రి లేడా - ఇక్కడనే వుంటున్నాడా?"

"మొత్తానికి విషయాలన్నీ సంగ్రహిస్తున్నావు."

"చెబుదూ —"

"లేడు - అందుచేతనే - ఇక్కడనే వుంటుంది."

"పాపం!"

"నీ పాపపుణ్యాలతో వాళ్ళకు పనిలేదు."

"సరేగాని నీకు తెలుసుగా - నీవే ఎందుకు వెళ్ళరాదు."

"తెలిసియున్నావిషయం కాబట్టే వీలులేదు."

"కారణం?"

"ఇంతకుముందు మాఫ్రూళ్లో వుండగా మాయిద్దరిమీద గొడవలు వచ్చాయి."

"మరింకనే! అంతవరకు వచ్చిందన్నమాట వ్యాపారం?"

"ఎంతవరకూవస్తేమాత్రం ఏంలాభం? కిట్టనపుడు."

"లాభంకిట్టని వ్యాపారం చేస్తున్నావా ?"

"మొదటనే కిడుతుందామరి..."

"ఇంతకూ వ్యాపారం సాగుతుందన్నమాట."

"అవన్నీ ఆనక ఆలోచిద్దాంగాని, ముందు చెల్లిరా."

"అసలు అద్దెకిస్తారా అని."

"ఇస్తారోయ్ నాయనా ఇస్తారు. ఇందాక ఆ అమ్మాయియే చెప్పింది."

"మరి! ఇంక లేనిదేముంది? చూపులు మాటలున్ కలలు సూత్సన్నప్పసైగలు ప్రేమజాబులున్..."

"అయ్యో! చేప్పరా! ఎందుకొచ్చిన కవిత్వంరా బాబు."

"పోసి వెళతానుగాని, ఆమేష్టార్ను నే నెరుగను. ఏలాగుమరి!"

"ఇంకెవ్వరూ ఉండరు. ఉన్నవాళ్లే మేష్టారనుకో."

"మరి ఆమెభర్త ఉంటే—"

"ఇంకా పెండ్లికానిదే—"

కుమార్ ముఖ మెందుకో వికసించింది. గుండెలు కొట్టుకుంటున్నాయి. కుడికన్ను అదురుతుంది. బహుశా అదంతా 'ప్రథమదర్శనజనితానురాగమహిమ' అనుకుంటూ!

"వేణూ! చూడరా! చేపల్లా చెదరే కండ్లు - నల్లత్రాసులా బుసకొట్టే వాలుజడ - ఐస్ఫ్రూటులాంటి అధరం."

"రామ! రామ! చంపుతున్నావురా నీకవిత్వంతో. నీతో నుంటే యిదే బాధ! అందంగానున్నా ఆడుది అగపడితే చాలు. అవ

రత్వం ఆమెలో హత్తుకుందంటావు. పాట వింటే చాలు. ప్రకృతికాంత ప్రణయగీత మంటావు. ఇక ఆశాలతలు - అనురాగం - అమరగానం నీకు పరిపాటే!"

"ఆ! చాల్లే! ఇంక నీ ఉపన్యాసం కట్టిపెట్టి ఆసుందరి దివ్య నామామృతరాలు కొంచెం నాచెవిని పడేయ్."

"అదిగో మరలా మొదలా? రామాయణమంతా విని సీత రాముని కేమవుతుందని అడిగేడట."

"అడగడూమరి! నీవంటివాడు 'రామునితో క- పీశ్వరు' అని చదివితేను—"

"అయితేఅయ్యిందికాని పోదాం రా."

"ఏమీ అవ్వందే! ఇంకా మాటలుకూడా కాలేదు. మరి మాట్లాడవద్దా? గదివిషయం?"

"సాయంత్రం మరలావద్దాం."

"అయితే పుల్లయ్య వేమవర మన్నామాట."

"మరి నీతో అంతకన్నా ఎక్కువా?"

"అదృష్ట ముండాలి. ఆవిషయం చెప్పవురా?"

"బాగుందిరా నీవరుస! చుట్టమని చూడొస్తే దెయ్యమై ఏమోచేసిందట."

"పోనీరా నీకంతకష్టంగానుంటే ఆమాటే యింక తలపెట్టను సరా."

"కష్టంగా నుండటానికి నేనేం పుస్తిగాని కట్టేనా?"

"ఏం కడితే నాకెందుకులే. నడు పోదాం."

... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ...

కుమార్ పూర్తిపేరు మీకేకాకుండా నాకూ తెలియదు. తెలియనక్కర్లేదు.

అత నెప్పుడు తనవినూత్నభావకవితారససాంద్రతరంగమాలికా డోలికల విహరిస్తుంటాడు.

అతన్ని ఉపాధ్యాయులు కుమార్ అంటారు.

అతన్ని తోడివిద్యార్థులు 'కవిగా' రంటారు.

అది అతనికి బిరుదుమాత్రమే!

అదే అతని ప్రస్తుతనామం - కవికుమార్.

అతనికి ప్రకృతి వశ్యురాలు.

అతనిది మృదుమధురగంభీరపదగుంభనము.

అతని పద్యాలు సమ్మోహనాస్త్రాలు.

అతని మాట వేదవాక్కు.

అతని ఉపన్యాసం అమృతవాహిని.

అతను అద్వితీయుడు.

అతనియందు నెవరకీ అందని భావాలు

కన్పడని శృంగారం
రూపులేని చైతన్యం
అంతులేని ఆనందం
అర్థంకాని మర్థవ్యం—

నిండి నిబిడీకృతమై యుంటాయి.

కవికుమార్ గదిలో ప్రవేశించి అంతా నెలరోజు లయింది. అతని జీవితం అతనికే అర్థంకావటంలేదు. చుట్టుపట్లనున్నా ముగ్ధలంతా ఆతని స్నేహాన్నే అభిలషిస్తున్నారు. అతని మాటలకే కుతూహల పడుతున్నారు. అతని చూపులనే కోరుకొంటున్నారు. అతని సాన్నిధ్యాన్నే వాంచిస్తున్నారు.

అతనూ ఆలోచనల్లోనే నిమగ్నుడైయున్నాడు. ఇంతలో—

"శేషా! పువ్వులు పట్టుకొని రావమ్మా" అన్నా ముసలికంఠం పిలుపు.

అతని ఆలోచనలు ఆగిపోయాయి. అనుకోకుండా అతని చూపులు ఆమె చూపులతో ఐక్యమయ్యాయి. ఏవో గుసగుస లాడు కుంటున్నాయికూడాను. ఇంతలో మరలా పిలుపు.

'శేషా! త్వరగా రావమ్మా.'

అతని గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. ఎందుకు? ఆమె అతనున్నా కిటికీముందునుంచే భారంగా వయ్యారంగా నడిచి వెళ్లిపోతూంది. అతను అనిమిషుడయ్యాడు.

ఎత్తైన వక్షస్థలం
జవజవలాడే నడుము
చెదరిపోని చూపులు
తడబడే పాదపద్మాలు

అతనికి పరవశత్వం ప్రసాదించేయి.

అతని ఆనందవాహినికి గట్టులు తెగిపోయాయి.

మబ్బుల్లో మెరుపొకటి
మాయమైపోయింది
మెరుపుతో నా మనసు
కరిగిపోయింది—

అతనికి తెలియకుండా అతని పెదవులు సృష్టించిన భావగీతం అది.

తిరిగి ఆలోచనలో పడ్డాడు.

"శేష— శేష" అప్రయత్నంగా అంటున్నాడు. ఎవ్వరామె? ఇంకెవరు? అంటే - అతని కింతకుముందు గుమ్మంలో దర్శనమిచ్చిన ప్రణయసుందరి. అనురాగంతో - ఆనందం - ఆనందంలో తన్మయత్వం-

అంతలోనే ఈలపాట ప్రారంభించాడు. అతన్ని ఈలపాటకు గాజుల కలకలధ్వని తాళం కట్టింది. అతని ఆశ్చర్యాని కంతులేదు. పన్నెండు సంవత్సరాల పడుచు కాగితం పట్టుకొని ప్రత్యక్షమయ్యింది.

''ఎవరు కావాలి ?'' అతను ధైర్యంచేసి అడిగిన ప్రశ్న.

'మీారే...' ఆమె కొంటెజవాబు.

'ఎందుకు ?'

'అవసరంవుంది.'

'అక్రమమంకాకపోతేసరి.'

'అయితే ఇది చూడండి' అంటూ ఒక కాగితం అందించింది. దానిమీాద —నవ్వుస్తే- 'పున్నమవెన్నెలరేయీ - హాయీ పున్నమవెన్నెలరేయీ...' అని వుంది.

'ఏమిటిది ?'

'తెలియటంలేదా - పాట'

'ఎందుకు ?'

'పాడుకోటానికి.'

'ఏంచేయమంటావు.'

'వ్రాసి యిమ్మంటాను.'

'ఎవరికి ?'

'మా అక్కకు'

'అయితే కావలసినవారే రావటం న్యాయం' ఇంతలో లోపలి నుంచి కోకిలకంఠం పిలుపు-

'సుబ్బులూ - సుబ్బులూ'

'నీ పేరు సుబ్బులా ?'

'సుబ్బలక్ష్మి'

'అమ్మో—'

'త్వరగా వ్రాసియివ్వండి. మరలా మా మామయ్యగాని వస్తాడు.'

'ఏం ? రాకూడదా ?'

'ఏమో నాకు తెలియదు.'

'పోనీలే వ్రాస్తూంటాను. వెళ్లిరా. ఎవరో పిలుస్తున్నారల్లే వుంది.'

'ఇందుకే మా అక్క పిలుస్తుంది.'

'పేరు ?'

'శేష-'

అతని ముఖ మెందుకో మార్పుచెందింది. అంతరాత్మ అర్థం కాని ఆరాటాన్ని అనుభవిస్తుంది. ఇంతలో తలుపుచాటునుంచి-

'సుబ్బులూ- ఒకసారి పాడి స్టైలుకూడా చెప్పమనవే!' శేష పలుకులకు కుమార్ పెదవులమీద చిరునవ్వు మొలకలెత్తింది.

'మధ్య నేనెందుకు నీవే చెప్పరాదూ' అంటూ లక్ష్మి కోపంతో పోబోయింది.

'ఎవ్వరూ చెప్పనక్కరలేదులే- రా సుబ్బులూ! పాడతాను.'

'నన్ను సుబ్బులూ! అని పిలవటానికి వీలులేదు తెలుసా.'

'చెప్పేవుగా ఇప్పుడు తెలుసు- అయితే ఏమని పిలవాలి ?'

'లక్ష్మి- అని'

'క్షమించు లక్ష్మి'

'ఆ! ఈమాత్రందానికే అంతమాటా!' అన్నా శేషమాటలతో కుమార్ హృదయం తేలికపడింది.'

'పాడుమరి కుమార్. త్వరగా - హాయిగా'

'మెల్లగా - చల్లగా - విను లక్ష్మి'

పున్నమవెన్నెలరేయీ - హాయీ
పున్నమవెన్నెలరేయీ— ॥పు॥
పాలవెన్నెల సంద్రములోన
కలహంసలమై ఈదులాడగా
గండుతుమ్మెదా ఎలదేటిబోటుల
మేలిజంటగా విహరించుటకే - హాయీ
ఈ రేయీ - మనకే - ఈహాయీ—॥పు॥

పాట పూర్తయింది. శేష, లక్ష్మి వెళ్లిపోయారు. కుమార్ తిరిగి ఆలోచనలోపడ్డాడు. మేస్టారు లేనిసమయంలో శేష ఏదో వంక పెట్టుకొనివచ్చి కుమార్‌కు కనపడీకనపడనట్లు షికార్లుకొడుతుంది. ఆమె మనసును అనేకవిధాల అర్థంచేసికొంటున్నాడు. ఇంకా ఏదీ నికరంలోకి రాలేదు. ఆమె-

వెన్నెలకాచే వీక్షణాలు
వలపులు మొలచే పలుకులు
ప్రణయము పండే చెలువము

అతనిని యెక్కువగా ఆకర్షించాయి. ఆమె మాట్లాడే ప్రతిమాటలోను ధ్వని ద్వంద్వార్థం అతనిని అప్రమత్తుని చేస్తాయి. అటువంటి ఆనందంతో భావగీతాలు సృష్టిస్తాడు. ఆలాపనచేస్తాడు—

వారి స్నేహం పూవుతావివంటిది.
దాని కెన్నడూ అంతరాయం లేదు,
వారిమధ్య రహస్యాలు లేవు.
శరీరాలు వేరైనా మన సొకటే—?

ఎవరువారు? రూపొందిన స్నేహమూర్తులు. దాసు - కుమారులు. సహపాఠకులు, సమవయస్కులు.

'ఏరా! దాసూ! ఈగదిలో నుండటం చాలాకష్టంగా నుందిరా.'

'ఏం గోపాలకృష్ణునిలా అనుభవించలేకా?'

'ఏం అనుభవమోయ్ - చస్తుంటేను—'

'అంత కొంపేం వచ్చింది?'

'మహా స్త్రీ రత్నాలు-' అంటూ ఉత్సాహిక కవర్లు అతనిముందు పారేసి 'ఇంతా నెలరోజులు నుంచీ వారేసు నేను వచ్చి - అబ్బా ఏం ప్రపంచం' దాసు ఆశ్చర్యంతో వాటినన్నిటిని పొడుగవేసి మొత్తం మీద అయిదు రకాలు వేరుశాడు.

ఒకటి—'మీ సహవాస మభిలషిస్తున్న దీనురాలు,

మిస్ట్రెస్ - ఎస్. ఎస్. ఎమ్. సి.'

'ఓనా ఖర్మా! ఏ స్నేహమో. ఇదిగో ఆ యిల్లాలికి పుట్టిందే!'

ఇంకొకటి—'మీ ప్రేయసి కామాక్షి, కాంతామణి.'

'ఎవరు బాబూ ఈ కాంతామణిగారు?'

'చిట్టెమ్మ పదినగారట.'

'రాజు భార్య అనుకుంటాను.'

'ఏమోమరి-'

మూడవది—'శారద ఎవరురా కుమార్'

'ప్రక్క యింటవున్నాది చూడలేదా?'

'ఓ! అవును! ఆ సోగకన్నులా?'

'అవుననుకుంటాను'

మరొకటి—'ఈ చంద్రలేఖ ఎవరు?'

'అదే నాకూ తెలియలేదు.'

'ఉత్తరం ఎవరు తెచ్చారు.'

'ఉందిగా మన లక్ష్మి.'

'మరి వివరాలు అడగకపోయావా'

'అడిగేను. ఏదో చెప్పింది తికమకగా. నా కర్థంకాలేదు.'

'సరే యింక యివన్నీ మీ సొంతమన్నమాట.'

'అన్నమాటేగాని, వేణు మాత్రిగా ఇటువంటివాడేమిటిరా?'

'ఛీ! ఛీ! వాడువంటి చవట లేడనుకో! పట్టికోతలు, పెప్పీల్లు లాంటివి వాడి బుర్ర. అంతా చేస్తాను, [illegible] అంటాడు.'

'మరే- ఎవరైనా చేసినవి వాడనుకుంటు, వీడు లేనివి చెప్పుకుంటాడు.'

'పైగా సంసారులమీద.'

'అయితే 'సమ్రాట్'గా పుట్టాడని.'

'లేనిపోనివి [illegible] అక్కడక్కడ కొంపలు ముంచుతాడు.'

'పెరుగనివాళ్లు - నమ్ముతేను'

'అంతేవి.'

'ప్రతివాళ్ళూ తనను ప్రేమించిందంటాడు.'

'అప్పట్లే. ఈనాటి జుల్లా స్టారు హోటెళ్ళలో, ఎంతమంది గర్లుతో కంటాక్టువుంటే అంత గొప్పవాడన్నమాట.'

'బాగుంది క్వాలిఫికేషను. పోనీ అది నిజమైతే ఆలాగే అనుకోవచ్చు.'

'నిజం అయినా కాకపోయినా నలుగురకు తెలిస్తే మంచిది. అందుకని అసలు లేనప్పుడు స్వంతడబ్బా వాయించుకోవాలి.'

'బాగాచెప్పావు. శేష విషయంలోను యిలాగే కోస్తాడు.'

'సరే కోయనీయి. ప్రాకటుతూవుంటే యింకా కోస్తాడు. ఏమీ వ్యతిరేకించవద్దు. మనరహస్యం తెలియనీయవద్దు.'

'అలాగే' అంటూండగా వేణు రావడంవలన వారిసంభాషణ ఆగిపోయింది.

# 2

'నీవు చెబుతానన్నావిషయం చెప్పవురా కుమార్.'

'చెప్పకపోతే ! చెబుతానని ఎందుకంటానురా.'

'చెప్పమరి—'

'చెబుతానుకాని, దాసూ ! అబ్బా అవన్నీ తలచుకుంటే నేను మజ్నును అయిపోతున్నాను.'

'సరే, నీవు మజ్ను - ఆమె లైల - సరిపోయింది.'

'అటువంటి అదృష్టమే పడితేనా ! ఎంతభాగ్యం.'

'ఎందుకని- ప్రేమించి, వాళ్లేమిసుఖపడ్డారు- వాళ్ల జీవితంలో పొందిన ఆనందమేమిటి ? చివరకు వాళ్ల ప్రేమలకు ఫలితం మరణమేగా'

'ఎంతమాట దాసూ ! వాళ్లది ఫలితంకోరని పవిత్రప్రేమ.. అదియే ఈనాటికీ ఏనాటికీ కూడా వాళ్లను అమరజీవులను చేసింది. మాకటువంటిభాగ్యం పడితేనా ?'

'ఏమోలే! అవన్నీ మనకెందుకు? అసలువిషయం మొదలుపెట్టు. లైలా మజ్నూలే అవుతారో -శేషా కుమారులే అవుతారో - ఆవిషయాన్నీ తర్వాత చూద్దాం—'

'అసలు నేనాగదిలో ప్రవేశించింది వేణు బలవంతాన్నే అని తెలుసుగదా.'

'అవును. అంతవరకు నాకూ తెలుసు.'

'అవునా- అలా వారంరోజులు గడిచాయి. తర్వాత నావిషయం నీకు తెలుసుగా. వేణుమాత్రం నాతో చెబుతూండేవాడు. శేష తనను ప్రేమించిందని. తాను ఫలితంకూడా పొందేనని.'

'ఆ ! పొందకేం ? లెంపకాయలు ఫలితం.'

'ఈ సంగతి అప్పుడే నీ కెవరు చెప్పారురా ?'

'ఉందిగా, ఊరికల్లా టపామొయిలు, నీళ్లమోసే బాపనమ్మ.'

'కాకపోతే వాడికి బుద్ధియుండక్కర్లే. ఇంతకుముందు రెండుసార్లయిందా- మరలానా.'

'అంటే- ఇంతకుముందు చీవాటులతో సిగ్గురాలేదు. ఈసారి లెంపకాయలతోనైనా రోంపపట్టి ఉండాలి.'

'బాగాచెప్పేవు- అయినా ఇదంతా బాబులు ప్రోత్సాహమట.'

'ఉహు_ ఎవరన్నారు?'

'శేషే అంది. ఇంతకుముందు బాబులు, రాధాకృష్ణ కూడా ట్రయల్సువేశారట- ఉత్తరాలుకూడా చూపించింది మొన్నటివి.'

'అలాగేం- అంతవరకు వచ్చిందన్నమాట.'

'పాపం శేష మంచిది కాబట్టి అల్లరిపెట్టకుండా ఊరుకుంది.'

'అలాగనుకుంటే- అదే కొంపముంచుతుంది.'

'ఏమోగాని అసలుకథ విను-'

'సరే కానియ్'

'ప్రేమసౌధానికి ప్రథమసోపానము చూపులన్నారు. ఆమెట్టు వెదక్కుండా కాలికి తగిలితే సౌధారోహణంచేయనివా డెవడు?'

'అవున్లే- అది సృష్టినైజం. అందులోను నీవు రసికుడవు. కళాపిపాసివి.'

'ఆమె అందానికన్నా- ముగ్ధత్వం - వాక్చాతుర్యం నన్నెక్కువగా ఆకర్షించేయి.'

'నిజమే! కవులకు కావలసింది కమ్మదనమే గాని, మొగము మొత్తే బెల్లపుతీపి కాదుగా.'

'వాళ్ల మేనమామ లేనిసమయంలో వచ్చి నాయెదుట నేవేవో వింత వింతచర్యలు చేసేది. ఆచెట్టుపువ్వు, ఈచెట్టుపువ్వు కలిపి నావంక క్రీగంట చూచి ముసిముసినవ్వులు నవ్వేది. వింత వింతగా మాట్లాడేది.

విరహగీతాలు పాడేది. చివరకు ఒకసారి శ్రావణ శుక్రవారము. ఆనాడు మాలతీ చెండుతో కొట్టింది. నేను మాట్లాడలేదు. వెంటనే ఒకగడ్డిపరక నలిపి ఉండగాచుట్టి దానిలో ఒక పూరేకు పెట్టి విసరింది. నాకు అనుమానం వచ్చింది. ఆమె చేసేప్రతిపనిలోను ఏదో కొంత అర్థం ఇమిడియుంటుంది. చెండు విప్పేను. నా అనుమానం నిజమైంది. నా ఆశ్చర్యానికి అంతులేదు. అందులో ఒక చీటీ వుంది—'

'అబ్బా! ఎంతయుక్తి పన్నిందిరా? మరి దానికి నీ వెలా జవాబిచ్చేవు?'

'వినుమరి! ఆ క్రితంరాత్రేకదా మనం ప్లీడరుగారి గార్డెన్‌లో అయినఅయిదువందల గులాబీలు కోసి తెచ్చాము.'

'అవున్లే! అయితే—'

'అందరికీ పంచిపెట్టగా యింకా రూములో కొన్ని వున్నాయి. అప్పుడొక పెద్దపువ్వు తీసి దాని రేకులమీద 'థ్యాంక్స్ - సంతోషం' అని వ్రాసి ఆమెపైకి విసరేను. కాని వ్రాయటం ఆమె చూడలేదు. అందుకని మాట్లాడకుండా తలలో పెట్టేసుకుంది.'

'మరి చివరి కెలా తెలిసింది?'

'వెంటనే నేనొక పద్యం చదివేను ఇలాగని—

ప్రేమజవాబు నొంది బలె ప్రేయసికొప్పున జేరి యూరకే గీముసు జూపనేల? కలిగింపుము నిన్ గన యూహ నెమ్మదిన్.'

'మంచిపనిచేశావురా- అర్థమయిందా?'

'అబ్బో మనకన్నా తెలివైనబుర్ర. నా యెదుటనే ఆపూవును తీసి చదివి ఆనందంపట్టలేక కేరింతాలు మొదలుపెట్టింది. వింత భావాలుదోపె చూపులు - చూపులతో పాట - పాటతో నాట్యం-'

'సరి సరి ఏదీ! పాడు చూద్దాం.'

'నీతో చెప్పటం చిక్కొచ్చింది. పాడిందా కానుండి ఆడమంటావేమో!'

'ఛా! ఛా! ఎంతమాట.'

'బలేవాడవురా! తేగవంటిపిల్లాడంటే- తేగ తెచ్చి యిమ్మని యేశ్చాడట.'

'నీ సామెతలకేమిగాని త్వరగా పాడుదూ చంపక.'

'తప్పుతుందామరి. చిత్తగించండి.'

'ఆహా! సావధానులమై ఆలకించుచున్నారము.'

'చాల్లే నీకొంటెతనం కట్టిపెట్టు.'

'ఊఁ! పాడు! పాడు!'

'సంతసమాయె నహా - ఆహా కోకిలా ॥సం॥
నీమదిప్రేమ తెలిసిన నేడు - ఎంతో సంతసమాయె నహా
అంతకు ఇంతా ప్రేమజవాబు
జాబును వ్రాయు - కరములే కందునా
కోకిలా - వ్రాయు మికముందు—— ॥సం॥
లక్ష్మితో - మసలక్ష్మితో - వసంతలక్ష్మితో
పంపెద జాబు - పంపుము మరలా॥ సం॥'

'అబ్బా! ఎంతనిగూఢంగా పాడిందిరా? అందులోని అర్థం నీకేగాని పైవాళ్లకు తెలియును. ఎవరైనా విన్నప్పటికి ఏవో పాటను కుంటారు. కాని——'

అప్పుడే- అన్నట్లుగానే ఆమరునాడు లక్ష్మితో పంపించింది లెటరు——'

'ఏమని వ్రాసిందిరా?'

'ఏమో నీకే యిచ్చానుగా అన్నీను.'

'అసలు మనలోమనమాట.'

'ఏమని వ్రాస్తుందో తెలియదూ.'

'తెలిస్తే అడగడమెందుకు సార్.'

'తెలుస్తుందిలే సార్.'

ఇద్దరూ నవ్వుకుంటున్నారు.

'అయితేఅయ్యిందికాని బాగాచెప్పావురా కుమార్.'

'ఇప్పటికింకా ఏమీ అవ్వందే.'

నవ్వు మరింతయెక్కువయ్యింది.

'ఏరా కుమార్ ! ఇంతకూ, నీ రొట్టె తేనెలో పడుతుందన్న మాట—'

'కాదు కాదు- తేనె రొట్టెలో పడుతుంది.'

నవ్వులు మిన్నుముట్టేయి.

'తర్వాత ఒకరోజున- ఆనాడు ఆదివారం అంటే అది మాకు సుదినం. ఆనాడు వేణు వుండడుకాబట్టి శేష వస్తానంది. అదే తొలి సారి. అంటే మా హృదయాలు యెంతగా ఆరాటంతో తపించిపోయాయో నీ కెలా అర్థమవుతుంది ?'

'అర్థంకానక్కరలేదులే తర్వాత చెప్పు.'

'ఎప్పటికీ సూర్యాస్తమయం! కావటంలేదు. ఆ మధ్యాహ్నం ఎందుకైనా మంచిదని శేషకు మరలా జ్ఞాపకంచేద్దామనుకున్నాను. కాని శేష కనపడటంలేదు. ప్రొద్దు క్రుంకిపోతూంది. నా ఆరాటం అతిశయించిపోతూంది. సాయంత్రం లక్ష్మి కనిపించింది. లక్ష్మిని పిలిచి 'మీ అక్కతోటి యీ వేళ ఆదివారం అని చెప్పేను' అని చెప్పమన్నాను.'

'అంటే నీ ఉద్దేశ్యం?'

'తప్పకుండా రావలసిందని.'

'బాగుంది. వచ్చిందా ?'

'వినుమరి- లక్ష్మి వెళ్లి చెప్పిందట- అపుడు శేష తనకు కొంచెం కుంకుమ తెచ్చిపెట్టమని- తెచ్చియిచ్చాక ఆకుంకాన్ని లక్ష్మి బట్టలు మీద చల్లింది.'

'ఎందుకు ?'

'అందులోనే వుంది అసలు కీలకం. కుంకుమ చల్లిందంటే, తాను ఇంటిలోనికి రాపీలులేదని, మైలపడిందని అర్థం. అది నోటితో చెప్ప కుండా వ్యంగ్యంగా నిగూఢంగా తెలిపింది.'

'అరి నీయిల్లు బంగారంగానూ! ఎంత బుర్ర వుందిరా నాయనా నీకు. చాలా గట్టివాడవే! మన సి. ఐ. డీ-లు బట్ట విప్పి చూపెట్టినా పట్టుకోలేరు. ఉ ! సరి సరి బాగుందే! తర్వాత లక్ష్మి వచ్చి చెప్పిందా ఇదంతా.'

'దాని మొఖం దాని కేం తెలుసు. ఏమిటో అని ఊరుకుంది. నేనుమాత్రం లక్ష్మికోసం యెదురుచూస్తున్నాను. ఇంతలో లక్ష్మి బట్టలు మార్చుకొని వచ్చింది—'

'ఏమిటి లక్ష్మి ! విశేషాలు! రంగుపిరాయించి పోకు డమా యించావు !' అన్నాను. దాని కామె—

'ఆ ! మంచి నిరవాకమే! పాపం ఏదోచెప్పమన్నావుకదా అని చెపితే నాపరికిణీనిండా కుంకం జల్లింది. ఎందుకంటే మాట్లాడదు. నవ్వు తాది. నాకు విసుగెత్తి చక్కావచ్చాను' అని వెళ్లిపోయింది.

'అప్పుడు గ్రహించావన్నమాట, అసలుసంగతి.'

'అవును అంతే!'

'పాపం ! ఇంతకూ ఆనాడు మీరు కలిసికోలేదన్నమాట.'

'సరి సరి ! ఆనాటి కేమిటి? ఈనాటికీ లేదు, ఇప్పటివరకు.'

'అరే ! అదేంకర్మం ! అన్నీకుదిరి అప్పుడే మూడు నెలలు కావచ్చిందే!'

'అవునుమరి ఏంచేస్తాం. ఎప్పటికప్పుడేదో అడ్డంకు వస్తూనే వుంది.'

'అసలు నీ కావుద్దేశ్యం పూర్తిగా లేదేమోలే.'

'గొప్పవాడవు. నీవు చూస్తూనేవున్నావుగా.'

'ఛా! ఛా! నే నేంచూస్తున్నాను! ఇది మరీ బాగుందిరా.'

'అదికాదురా నీకు తెలియనిదేముందని.'

'అదీ అలాగను.'

'పైగా తానే వచ్చి కలుసుకుంటానంటాది. మనం వెళ్ళటానికి వీలుగాదట.'

'సరేగాని, ఎందుకైనామంచిది- నేను- అందూ, నీకు పుణ్యముంటుంది.'

'సరే! అలాగే అనుకో.'

'థ్యాంక్స్- అలాగే అనుకుంటాను గాని, మరి యిక లే- పోదాం! ఆకలిమంటల కాగలేను, లే పోదము—'

'ఓహో! పద్యాలల్లేస్తున్నావే.'

'ఏకో ఇంతకాలం కవికుమారుని కావ్యశ్రీ చదివితినే, ఈమాత్రం పట్టుపడదా?' అంటూ యిద్దరూ భోజనాలకు వెళ్ళిపోతారు.

'మరొకనాడు. ఆనాడు శనివారం— శేష యింట్లో అందరూ సినీమాకు వెళ్ళిపోతారు. వాళ్ళముసలమ్మ, శేష, మాత్రం మిగిలి పోతారు. సాయంత్రం ఆరుగంట లయింది. కుమార్ గ్రవుండునుంచి బేట్ నూపుకుంటూ వచ్చాడు. కాంపౌండుగేటు వేసివుంది. తలుపు కొట్టేడు ఆతనికోసం నిలువుగాళ్లతో నిరీక్షిస్తున్నా శేష తటాలున పరుగెత్తుకువచ్చి—

'ఎవరువారు' అంది.

'ఎవరు కావాలి' కుమార్.

'కావలిస్తే వస్తారా?'

'వస్తే తీస్తారా?'

'తీస్తే తప్పకవస్తారా?'

'రావటాని కేగా తీయమనేది.'

'అయితే రండి.'

'మరి తలుపు తీయించండి.'

అంటే శేష చిరునవ్వుతో తలుపు తీసి 'నేనే ఓడిపోయాను చివరకు. బతిమాలినదాకా తీయగూడదనుకున్నాను. కాని మీతో నా వాగ్వాదం- మీరు కవికుమారులు.'

'అలాగేం' అంటూ నెమ్మదిగా ఆమె బుగ్గమీద చిటుక్కు మనిపిస్తాడు. దానితో నామె ఉబ్బి తబ్బిబ్బైపోతుంది.

'ఏమిటీ శేషా ఈవేళ నీ కీహుషారు.'

'మావాళ్లంతా సినీమాకు పోయారు.'

'మరి నీవు వెళ్ల లేదేం-'

తలవంచుకుని క్రీగంటచూస్తూ నవ్వుతుంది.

'ఓహో! స్వంతసినీమాకోసం ఆగిపోయావా ?'

'ఛీ! పోనురూ! అన్నీ కొంటిమాటలే.'

'అయితే పోతున్నా' అంటూ రూములోనికి పోబోతాడు.

'ఆ! ఆ! మిమ్మల్ని కాదు పొమ్మంట'

'మరి యెవరిని ?'

'మన్మథుణ్ణి'

'ఎలా పోతాడు ?'

'పోయేలాచేస్తేసరి.'

'అబ్బా! ఎలాగయినా స్త్రీలు మాటమారిలుకదా'

'పాపం! పురుషులకు అసలేమీ తెలియదు. అందులోనూ మీ కసలే తెలియదు.'

'తెలిసివుంటే నీ కెందుకు లొంగిపోతాను ?'

'అలసిపోయి-'

'అదుగో అదుగు అడుగుకూ నీజాణతనం కనబడుతునేవుంది'

'అంతేకాని మీ కొంటెతనం కనబడదేం ?'

'సరేగాని— మరి—'

'ఊ ! మరి— ఏమిటి ?'

'తెలియదా ?'

'తెలిస్తే మరలా తిరుగవెయ్యడమెందుకు ?'

'నాచేత పలికిందామని'

'అన్నీ మీరే పలుకుతున్నారు- చిలకలాగ.'

'అయితే నీ కేమీ తెలియదా ?'

'తెలియదు.'

'ఇదిగో—'

'ఊఁ! ఏది—'

ఒకరునొకరు చూచుకొని పక్కుమని నవ్వుతారు.

'అందుకనే ఇంతులు చంచలాత్ములు- అన్నారు పెద్దలు.'

'అలాగాండీ! మరి ఆపెద్దలే! కాముకపూరుషాళి తమకంబగు మాటలు నమ్మవచ్చునే- అన్నారేమో.'

'చాలా గట్టిదానవయ్యావే.'

'ఏదో మీ శుశ్రూష—'

ఇంతలో శేషా అని వాళ్లమామ పిలుస్తుంది.

'అరే ! ఏవరో వున్నారే యింట్లో !'

'మా మామ్మ ఇంకెవరూ లేరు'

'మరి... ...'

'ఫరవాలేదు. భోజనంచేసి త్వరగా రండి. నేనుకూడా యీలోపున...'

'ఆల్ రైట్.'

శేష లోపలకు వెళ్లిపోతుంది. కుమార్ భోజనాలకు వెళ తాడు. సుమారు ఎనిమిదిగంట లవుతుంది. దశమీచంద్రుని వెన్నెల పిండారబోసినట్లుంది. శేషా కుమారులు కాంపౌండుగేటు బిగించి మల్లెపందిరిక్రింద కూర్చున్నారు.

'శేషా! మీ మాంమ్మగాని వస్తుందేమో?'

'అబ్బే రాదు. అసలు లేవలేదు. అందులోను కండ్లు కనిపించవు. ఆవిడకు సాయంగానే నేను ఉండిపోతూను.'

'పాపం! ఎంత జాలి- ఎంత దయ- ఎంత విశాలహృదయం. అయితే నీగురించికాదన్నమాట నీవు మానేస్త—'

'నీ కెలాతోస్తే అలా అనుకో కుమార్.'

'శేషా! నీవంటిప్రియురాలు చెంతనుంటే- ఇంక ఇదికాదో స్వర్గము. వేరె కలదా మరెక్కడో అనిపిస్తుంది సుమా-'

'కుమార్ నీలో ఏదోమహత్తరమైనశక్తి వుంది. అది నీకన్నులలో వెలిగే దివ్యకాంతి అనుకుంటాను. నీ కన్నులకాంతిముందు ధవళజ్యోత్స్నతేజముకూడ సిగ్గుపడవలసిందే. ఆశక్తియే స్త్రీజాతిని, ముఖ్యంగా నన్ను నీచెంతకు ఆకర్షిస్తూంది మహాబలంతో—'

'శేషా! ఒకమాట! మన ప్రేమ నిర్మలమైనదే! అది నే నెరుగుదును. మన శరీరాలు వేరైనా మనస్సులు ఒకటే! అయినా మన కీజన్మలో యీదుష్టభూయిష్ఠ జాతి కుల మత భేదాలుగలయీసంఘంలో మన ప్రేమకు స్థానంలేదనుకుంటాను.'

'ఎంతమాట కుమార్! సంఘానికి జడిచి ఆత్మను చంపుకుంటామా? మన వర్ణాంతరవివాహానికి సంఘం సమ్మతించదా! పోనీ! సంఘం మనల నెప్పుడూ పూజించదు. ఎప్పుడూ పోషించదు. నీవు కాపు. నేను బ్రాహ్మణకన్యనైనంతమాత్రమున మన పవిత్రప్రేమ నాశనంకావలసినదేనా?'

'సంఘం మనలను బహిష్కరిస్తుందేమో!'

'మనమే ముందుగా సంఘాన్నే బహిష్కరిద్దాము.'

'ఎదురీత ఈదగలమా.'

'నీవే అధైర్యపడితే అబలను నేను చెప్పగలనా?'

'పొరబాటు- స్త్రీలు మానసికంగా అబలలుకారు, సబలులే- చెప్పు ఏంచేదాం.'

'చెప్పటాని కేముంది. చూడు సావిత్రి పెండ్లి ఎలాజరిగింది?- పోనీ వశిష్ఠు డెవరిని పెండ్లాడేడు?'

ఆమె మనోనిశ్చయానికి అత నెంతో ముగ్ధుడైపోయాడు. మెల్లగ దక్కరకు జేర్చుకొని- 'శేషా! నీ పవిత్రహృదయంలో నాకు తావుందా?'

'అయ్యో! కుమార్! ఎంతిమాట- నీప్రేమభిక్షకోరే దీను రాలిని. నీ పాదసేవచేసే దాసీని. ఇంక నా హృదయంలో నీవు తప్ప మరోవస్తువే లేదు. నా హృదయంనిండా నీవే!'

'శేషా —' అతని వేడిరక్తం ఉప్పొంగిపోతూంది.'

'శేషా- శేషా' అని అనూయికంగా అంటూ ఆమె పాల మీగడలవంటి చెక్కుటద్దాలను నిమురుతున్నాడు.

'కుమార్! ఎప్పుడూ నీదగ్గరవుండాలని- నీమాటలే వినాలనీ- నీముఖమునే చూడాలనీ- ఇంకా యెన్నెన్నో ముగ్ధకోరికలు నాలో బయలుదేరి చెప్పలేని ఆవేదనపుట్టిస్తాయి.'

'నిజమేనా! శేషా! అబ్బా నాకూ అలాగేవుంటుంది. నీకూ వుంటుందా? అయితే నాకష్టసుఖాలు పంచుకునే సహధర్మచారిణివి- ధర్మపత్నివి నీవే- నీవే' అంటూ తనకౌగిలిలోకి లాక్కుంటాడు.

'కుమార్ నిన్ను తలచుకున్నా. ఆనందభాష్పాలు- మావారి ఛాందసం దలచుకున్నా విచారభాష్పాలు కలసి గంగా యమునల్లాగ ప్రవహిస్తుంటాయి.'

'శేషా- నీవంటి ప్రియు- కాదు గృహలక్ష్మి దొరకడం నాపూర్వపుణ్యఫలం. నేను చాల అదృష్టవంతుణ్ని.'

'ఆ అదృష్టం నాది కుమార్.' అంటూ తనచేతులను అతని కంఠానికి పెనివేయబోయింది. వెంటనే కెవ్వుమని కేక వేసింది. ఏమిటో అర్థంగాక కుమార్ హడలిపోయాడు! శేష ఏమన్నా.'

'కుమార్ తప్పుకో- ఊఁ- త్వరగా- తప్పుకో.'

'ఏమిటి శేషా?'

'అబ్బా- తేలు- మాయదారి తేలు చంపింది.'

మొదట కుమారుకు నవ్వు వచ్చినా పాపం ఆమె స్థితి జూచి జాలిపడ్డాడు. చివరకు చినుకు చినుకు గాలివాన అయింది. నలుగురూ వచ్చారు. మంత్రాలు- మాకులు- కాని తగ్గలేదు. పాపం- ఆరాత్రి అంతా శేష బాధపడుతూనేవుంది. ఇంతలో నినిమాజనంకూడా వచ్చారు. ఆవిధంగా ఆనాటికికూడ శేషా కుమారుల కలయిక ఆగి పోయింది... కాలం తెచ్చేమార్పులు కనుక్కో లేముగదా!

# 3

'యౌవన జీవన మాహా-

నవ యౌవన జీవన మాహా-

జీవనమే హాయీ-

మన జీవనమే హాయీ—' అని కుమార్ విరచిత భావ గీతాన్ని బాసు పాడుతున్నాడు. కుమార్ ఫ్లూటు వాయిస్తున్నాడు. వారి పాట పన్నగాలు ఆలకించకపోయినా, పడతులు ఆలకిస్తున్నారు. పాట పూర్తిఅయింది. ఇంతలో అంతవరకు ప్రక్కను పొంచివున్నా శేష, తానందుకుంది.

'చక్రవాకముతోటి
కబురంపియున్నాను-
కరుణలేదా నీకు-
దరియరావా నేడు - చందమామా-
కటికచీకటిలోన కన్నీరు కార్చు
లేకున్నాను రాగదే చందమామా!
కలువకన్నెను నాదు - వలపూరుహృదయమ్ము
పదిలిపరచితి నందుకో చందమామ—'

పాట పూర్తి కాకుండానే ఆగలేక దాసు పక్కుమని నవ్వాడు. శేష లోపలికి పారిపోయింది. దాసు కొంతినవ్వు తగ్గించుకుని—

'ఏరా— చాలా అసాధ్యుడవులాగున్నావే- అంతచేటుచెప్పిపెట్టకు తిరిగి మనకంఠానికే పడుతుంది ఉరి.'

'నేను చెప్పటం చెబుతున్నానుగాని, ఏమీ పెట్టడంలేదుగా- అయినా కంఠానికి ఉరే పడుతుందో, పూలమాలే పడుతుందో—'

అంటూండగా వేణు, బాబులు వస్తారు. దాసూ, కుమారుల ఆనందం వారికి కంటకమయింది. వారి సంతోషం వీరికి విచారకరమయింది. అసూయాగ్రస్తుని హృదయం, బండరాతికన్నా మొండిది. అది ఒక్కొక్కపుడు ఏఉపద్రవమూ లేకుండానే తనకుతానే బీటలు దీసి బ్రద్దలైపోతూవుంటుంది. అసూయగలవానికి విచారంతప్ప ఆనందమెప్పుడూ నుండదు. లేనిబాధ వేధిస్తూవుంటుంది. దిల్‌కుష్‌గా నవ్వుకుంటున్న కోటిమిత్రులు- సాటిమానవులును చూచి వేణు ఓర్వలేకపోతాడు. అతని ముఖం వెలవెల బారింది! అది కనిపెట్టి కుమార్ మాట్లాడకూరుకున్నాడు. దాసు మరింత మరింతగా నవ్వుతున్నాడు, ఏడ్చేవాడిని ఏడిపించాలన్నట్లుగా!

'ఏరా కుమార్ ! దసరాసెలవు లిచ్చి అప్పుడే అయిదురోజు లయింది. ఇంకా యింటికి వెళ్ళలేదేం?' వేణు, అదోమాదిరిగా-

'ఏం- నీకెందుకు? మరి నీవు ఎందుకు పోలేదు?'

'నేను వెళ్లను. ఇచ్చటనే వుంటాను.'

'నేనూ అలాగే అనుకోరాదూ'

'అయితే సరే! ఎవరు కాదంటారు?'

'కాదంటే ఊరుకుంటారా' దాసు.

'ఊరుకోక ఏమిచేస్తారు-' (తీక్ష్ణంగా.)

'ఏంచేస్తారా—' దాసు మరింతగా.

'చాలు! చాలు! బాగుంది మీావరుస. ఈపాటికి కట్టిపెట్టండి. ఎవరైనావింటే నవ్వుతారు, సిగ్గుకూడాను' కుమార్.

'నవ్వుతారన్నా సిగ్గువుంటే- ఎందుకుంటుం దీభాగోతమంతా' అంటూ వేణు, బాబులు చేయిపట్టుకొని చరచరా నడిచివెళ్లిపోతాడు.

'ఏమిటిరా కుమార్! వీడి బిరుసు-'

'బిరుసుగాదది, తలవిసురు—'

'ఒకసారి కసవ్రుగరపిస్తే విసురు పోతుందేమో'

'పోనీలే! వాడియేడుపు వాడిని యేడవనిద్దూ, మన దేం పోయింది?'

'కుక్క మొరిగితే జంగం పరపతి పోదు గాని- ఇంతకూ తనకు లేదని- తనతర్వాత వచ్చిన నీవనుభవిస్తున్నావని వాడి యేడుపు.'

'అందుకనే యేడుపు మూడువిధాలన్నారు—

తనకు లేదని-

ఇరుగువాడి కున్నాదని-

పొరుగువాడిది పోవాలని—'

'అందులో ఆఖరురకం వీడి యేడుపు-'

'ఏడవనిద్దూ- మన దేంపోతూంది-'

'ఏమో పోరు నష్టం- అన్నారు పెద్దలు.'

'సరేలే- టీకి- పోదాం.'

ఇద్దరూ బయలుదేరారు. దారిలో—

'నీ వింటికి వెళ్ళలేదేం సెలవులకు?

'శేష బలవంతంగురించే- వెళ్ళటానంటే గొడవపెట్టేస్తుంది. ఒక్కనిముషంకూడా చూడలేకుండావుండలేనంటుంది. అందుకోనూ ఈమధ్యను మరీను.'

'అవును. స్కూలునుంచి వచ్చేటప్పటికల్లా వీధిగుమ్మం కాచుకు కూర్చుంటుంది, ఎప్పుడు చూచినా.'

'మరి అటువంటప్పు డేంచేయమంటావు?'

'అప్పన్లే- అది నీకే తెలియాలి.'

ఇంతలో వారు కాఫీహోటలు చేరుకోవటంవలన వారి సంభాషణ ఆగిపోయింది.

... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ...

సాయంత్రం 7 గంట లవుతుంది. గోదావరి ఒడ్డున పార్కులో రేడియో పాడుతుంది.

'నమ్మకురా జీవా- నమ్మ-
తేనెపూసినా - కత్తులతోటి
పాలనిపించే విషముతోటి
నిండిపోయె నీ - జగమూ సర్వము॥ న॥
గోముఖములుగల వ్యాఘ్రములుండె
నీదరినే మరి జాగ్రత సుమ్మా-

ప్రపంచమంతా మోసమె చూడూ
హితునిగనుండి హింసించుటేనా
మిత్రత్వములో మిగిలిన ఫలము—?
ఈర్ష్యాబాధితనరు డెవ్వడైన
చెడిపోవును గాదె తానే కడకు.'

పాట నందరూ అవధానంతో ఆలకించి అర్థంచేసికొని ఆనందిస్తున్నారు. కాని ఒక మూల నిద్దరు మిత్రులు మాత్రం యేవో గుసగుసలాడుకుంటున్నారు. వారి విస్రంభగోష్ఠి ప్రక్కనున్నా వ్యక్తికి షాక్ కొట్టింది. అతడుకూడా వారివైపు అకర్షింపబడ్డాడు. వారు చెప్పుకొనేది వినటానికి జాగ్రత్తపడ్డాడు. ఆవిషయం మన మిత్రద్వయానికి తెలియదు. వారి సంభాషణ—

'అయితే ఆవిషయం యదార్థమేనన్నమాట.'

'అవురాలా! నే నెన్నిసార్లు చూశానుకాదూ'

'నే నెన్నిచేసినా అంగీకరించటంలేదే!'

'అది నీ ఖర్మం-'

'ఏమిటీ- నా ఖర్మమూ- అలాగే చూస్తూండు. నన్ను ప్రేమించకుండా వాడిని ప్రేమించడం నా ఖర్మమో- దాని ఖర్మమో లేక మధ్యను వాడి ఖర్మమో తెలుస్తుంది.'

'నీది కాకపోతే వాళ్ల యిద్దరదీ అయివుంటుంది. అయితే మరి నీ వలాగోస్తావే! నీకూ దానికీ సంబంధమున్నట్లు-'

'అలాగో స్తేనేగాని మనకు గ్రేట్ నెస్ యేలావస్తుంది. అదీకాకుండా అలా చెబుతూంటే వాడు మానుకుంటాడు.'

'అవున్లే, ఆమాట నిజమే! వాడంటే అసలు అగ్నిహోత్రం లాంటి మనిషి. మరి ఎలాగ తగులుకున్నాడో, ఆమె వలలో-'

'ఆమె వలలోనే తగులుకున్నాడో, మృత్యుదేత ఉరిలోనే తగులుకున్నాడో.'

'ఎందుకులేరా ! పాపం ! అంతమాట-'

'అహా! కాదు లే- మాటవరుస కంటున్నాను.'

'అంతే లే—'

'అసలురహస్యంమాత్రం యెవరిదగ్గరా అనకు సుమా- మరలా మనం ఫూల్సు అయిపోతాం.'

'ఛా, ఛా, ఆమాత్రం తెలియదేమిటిగాని, ఇంతకూ ఏంచేద్దామంటావు.'

'అదే! ఆలోచిస్తున్నాను. పైగా మేష్టారొకరు వాళ్లకు సపోర్టు-' వెనుక వింటున్నా వ్యక్తి గుండెలు ఝల్లుమన్నాయి.'

'అవున్లే, ఆయన ఎడ్యుకేటెడ్. వాళ్లిద్దరకూ వివాహం చేసేస్తారేమోగూడాను. ఆయనే గార్డియను. అందులో మాత్రం తప్పేముంది ?'

'అయితే మననోటిలో మట్టేనేమిటి ?'

'అంటే నీవు చేసుకుందామనా ?'

'ఛా ! పోనిస్తూ ! పెళ్లెందుకు ? అందులోను పరాయివాడిమీద మమకారంవున్నాదాన్నా ?'

'అయితే అనుభవించటానికే అన్నమాట.'

'అంతే అనుకో—' అతని నీచాభిప్రాయానికి వెనుకవ్యక్తి తల పంకించేడు.

'మనం సక్సెడు అవటానికి ఉపాయ మేదైనా వుందా ఇంతకునూ'

'ఒక మంచి ఉపాయ ముంది. నిరపాయమైంది.'

'ఏమిటి చెప్పూ-'

'చెబుతానులే- టైము చూచి, అబ్బో 7-30 కావచ్చింది-లే పోదాం, భోజనానికి.'

'అయితే మనకు ఫలితం దక్కుతుందన్నమాట.'

'ఓ- తప్పకుండాను.'

'అప్పుడు నన్ను మర్చిపోకు సుమా !'

'ఛా ! ఛా ! ఎంతమాట ?-' ఇద్దరూ లేచి బయలుదేరేరు. వెనకాలనున్నా వ్యక్తికూడా బయలుదేరేడు ఆలోచిస్తూను-'

'నే ననుమానించింది నిజమేనన్నమాట. పైగా నేను సపోర్టు చేస్తున్నానా ? నా కసలు ఇంతవరకు అసలు విషయం యదార్థం తెలియదే !- అవున్లే, నన్నుగానట్టు లూరుకుంటే, అలాగే వుంటుంది. పోనీ బాబులు చెప్పినట్లు వాళ్లకు పెళ్లి చేసేస్తే ఏలావుంటుంది- అబ్బో సాహసం—— వేణు ఇంత క్రూరుడూ, నీచుడూ అనుకోలేదే ! అవును, పయోముఖవిషకుంభం. వాళ్ల ప్రేమలు ఏలా మారతాయో- జీవితాలు ఏమవుతాయో! ఎదురీత యీాదలేక అలసి కాలప్రవాహంలో పడి కొట్టుకుపోతారో! గట్టు జేరుకొని ప్రణయసీమల విహరిస్తారో! ఇది ఒకవిధంగా నామీాదనున్నా భారం. వేణు వాళ్లను విడదీయటానికి యత్నిస్తున్నాడు. అది ప్రపంచంకోసం నాకు ఉపకారమే అయినా, ఆత్మరంగికంగా నాకు ద్రోహమే అవుతుంది. పైగా వేణు తన నీచాభిప్రాయాన్నికూడా వెలిబుచ్చాడు. దీనికి ప్రతీకారం ఏంచేద్దాం ? ప్రతిఫల మేమవుతుంది ? సరే చూద్దాం- ఏది ఎలా జరిగేదీని- ఎంత ప్రయత్నించినా- 'కాగలకారణార్థమూ- మానదు. వర్తమానపరిమాణము నాగదు' అన్నారు పెద్దలు. అనుకుంటూ ఆయన బరువెక్కిన హృదయంతో మెల్లగా నడిచిపోతున్నాడు.

ప్రపంచమంతా చదరంగపాళి-
పగలు రాత్రి, తెలుపు నలుపు గళ్లు-
సర్వజంతుసముదాయము చదరంగబలము-
ఆడేవాళ్లు, యముడు - మృత్యుదేవత.
ఏ నిముసంలో ఏం జరుగుతుందో ఎవరి కెరుక !

# 4

కుమార్ మంచి అందగాడు. పచ్చటిఛాయ- గుండ్రని ముఖం- ఉంగరాలజుట్టు- మిిదుమిక్కిలి విశాలనేత్రాలు- అతని అందం- మాటచమత్కారం- సమయస్ఫూర్తి- జాణతనం- ప్రతిస్త్రీని ఇట్టే ఆకర్షిస్తాయి. అతని ప్రతిమాటలోను, ప్రతిచేష్టలోను కళాప్రవీణత- రసికత్వం ఉట్టిపడుతూంటాయి. అది గ్రహించేవాళ్లకే తెలుస్తుంది.

ఆనాటిసాయంకాలం నాలుగు గంటలకు మిత్రులంతా వచ్చారు కుమార్ గదికి. అందరూ కలసి బయలుదేరేరు 'రేకెట్స్' పట్టుకుని. కుమార్ టిప్‌టాప్‌గా తయారయి వీధిగుమ్మంలో నిలుచున్నాడు- ప్రియురాలి చలువచూపు అంగీకారానికై- మామూలుసంగతి తెలిసి వున్నా దాసు తక్కిన బృందాన్ని బాతాఖానీలో పెట్టేడు. ఇంతలో శేష గుమ్మంలోకి వచ్చింది. నవ్వింది. కుమార్‌కూడా నవ్వేడు. శేష తనవాలునేత్రాలతో ఏమిటో సైగచేస్తుంది. కుమార్ మొదట గ్రహించలేకపోయినా తర్వాత మెడమీద తడుముకున్నాడు. 'ఎంబ్రోయడరీ వర్కు' చేసిన జేబురుమాలున్నది. నాలుక కరచుకొని తీసి ఫేంటుజేబులో పెట్టుకున్నాడు. శేష చిరునవ్వుతో ప్రక్కకు తప్పుకుంది. ఆ జేబురుమాలు శేష కుట్టింది. అంచుమీద రంగుదారాల లతలు, పైగా శేషాకుమారులు నామాక్షరాలుకూడా వున్నాయి! అందరూ కలసి శారద యింటిముందుగా వెళుతున్నారు గ్రౌండుకు. కుమార్ ఆతిన్నగా వచ్చేటప్పటికి శారద- 'యతుకినయెందు జయంత వసంతకంతులన్ జక్కదనంబునన్ గెలువజాలెడువాడు' అని మనుచరిత్ర చదువుతూంది. కుమారుని చూచింది- నా కుమారునిగా భావించింది. ఆమె సర్వాంగాలు ఉబికేయి. ఒళ్లు జలదరించింది. కాని లాభమేమిటి? 'కుమార్ సంపంగివంటివాడు. మధుకరాంగనలకు సరిపడడుగదా

సంపంగిపూవు!' వెంటనే నిరాశ- నిస్పృహాలతో- ఆమె దేహం పాతాళంలోకి క్రిందుకుపోయింది. స్టూడెంట్సు అప్పటికే చాలదూరం వెళ్లిపోయారు.

ప్రకృతిలో అందంగా వుండి తనను ఆకర్షించే వస్తువు దగ్గరపడ్డప్పుడు ఏజీవి తహతహలాడదు, ఆవస్తువుకోసమై ?—

చంద్రుని చూచి కలువ ఏందుకు వికసించాలి?
తుమ్మెదను చూచి పువ్వెందుకు సిగ్గుపడాలి ?
పర్వములందు రసోదయ మెందుకు కలగాలి? —
—అదియే సృష్టి.

మరునాడు దాసూ, కుమారులు కూర్చుని నోట్సు వ్రాసుకుంటున్నారు. ఇంతలో రంగడు వచ్చి, వాళ్ల నాన్న తనకొక హార్మోనియం కొన్నాడని- చూట్టానికి రమ్మని, వాళ్లవదిన శారద తప్పకుండా రమ్మన్నాదని బలవంతపెట్టేడు. తప్పనిసరిగా దాసూ, కుమారుం బయలుదేరేరు. గమ్యస్థానం చేరుకున్నారు. కుమార్ వాయిస్తున్నాడు. దాసు పాడుతున్నాడు.

'మెరు పొక్కటైనాను - మెరయకున్నదియేమొ
తొలకరించేరోజు - తొలగిపోయిందా
ఎండి వాడిన మనసు - బండయైపోయింది
ఏనాడు వర్షించు - విరహజ్వాలలు నార్ప'

పాట వింటున్నకొలదీ శారద హృదయావేదన యెక్కువైపోయింది. అసలే విరహావేదనతో కుమిలి కమిలిపోతూన్న ఆమె హృదయం- తన హృదయం తెలిసికొని పాడినట్లున్న దాసుపాటతో మరింత చీకాకు చెందింది. కుమార్‌కు తన కోరిక తెలుసు. తిరిగి తన మనసు తెలుపడు. జవాబు వ్రాయడు కాని కవ రందుకుంటాడు. అతను అంగీకరించినట్లా, తిరస్కరించినట్లా? అదే తెలియటంలేదు. దానిని నిర్ణయించుకోదలచింది. కుమార్‌నికూడా ఒకపాట పాడమని

బలవంతపెట్టింది. ఆపాటతో తనసంశయం తీరిపోవాలి! ఆపాటయే తనప్రశ్నకు సమాధానం కాబోతూంది. ఆమె గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. సన్నని, బంగారుతీగల్లాంటి కుమార్ వ్రేళ్లు ఆర్మోనియంమెట్లమీద నాట్యంచేస్తూవుంటే- అవి శారద హృదయానికి గిలిగింతలుపెట్టినట్లుంది. అతనివ్రేళ్ల ఉంగరాల కాంతులు ఆమె హృదయంలో మెరుపుల్లాగ ప్రతిఫలిస్తున్నాయి. పాడుచున్నాడు.

శశిచన యేమగు - ఆ రమణీయము
వ్యర్థమగునుగాదే - సఖి-
మాయా ప్రేమ - మాయా జగతీ
ఇది స్థిరమా - నిజమా కనుగొనగా
నిన్నటి ప్రేమ - రేపటి ద్వేషం
ఒక మనసందే - ఇమిడియుండుగా॥ శ॥

ఆమె ఆశలు అడుగంటేయి. హృదయం కృంగిపోయింది. వేడినిట్టూర్పు విడిచి—

'అయితే యింక నాజీవిత మిలా వ్యర్థంకావలసిందేనా? బాల వైధవ్యానికి పరిహారం లేదా? అనాఘ్రాతమయినా- అంటుద్రొక్కిన పూవు అంగీకారము కాదా? ఇంక ఈబెంగతో యీవిధంగా కృంగి కృశించి నశించి నాశనమైపోవలసినదేనా?—' అని శారద తనలో తాను అనుకున్నా ప్రశ్నలకు సమాధానం రాలేదు.

దాసూ, కుమారులు లేచారు. వెళ్లిపోయారు. శారద హృదయం బరువుతో దిగజారింది.

## ఒకనాడు—

ఆగ్రామంలో బుర్రకథ, 'బోస్ కథ.' వేణు, బాబులు, రాధాకృష్ణ, రామనాథం, రామం, దాసు, కుమార్ యింకా మిగిలిన వారంతా కథ వింటున్నారు. ఇంతలో యెక్కడనుండో ఒక పెద్ద

వచ్చి దానుకు తగిలింది. చూచేడు- ఎవరూ లేరు. మరలా చూచాడు- మరలా తగిలింది. సంగతి గ్రహించేడు. కాంతం దేవాలయంలోనుంచి కుమార్‌ను కొట్టబోయి తనను కొడుతూంది, అసలువిషయం అర్థం చేసికొని కుమార్ చెవిలో యేదో వూదేడు. తా నేదో వంకపెట్టి వేణుని, బాబుల్ని అవతలకు తీసికొనిపోయాడు— కుమార్ లేచి దేవాలయంలోకి వచ్చాడు. గుడిలోపల యెదురుచూస్తున్న కాంతం ఆనందంతో—

'వచ్చావా? కుమార్!'

'కనబడటంలేదా? ఎందుకు పిల్చావు?'

'ప్రేమారాధనకోసం.'

'అయితే దేవుని ఆరాధించు.'

'అందుకనే- నా ప్రత్యక్షప్రేమదేవుని ఆరాధించటానికే యిక్కడకు వచ్చింది.'

'చాల్లే, కట్టిపెట్టు. సిగ్గులేదూ! స్త్రీజాతికంతకూ కళంకం తెస్తున్నావు. పాతివ్రత్యం అక్కరలేదా?'

'అందరూ పతివ్రతలే- ఎందుకు కాదు?— 'వీలుకాక- వీలయితేనా...'

'అయితే- నీ ఉద్దేశ్యం?'

'వేరేచెప్పాలా?' అంటూ పైట జారవేస్తుంది.

'నోటితో చెప్పవా?'

'ఇంకా నా నోటితోనే చెప్పించాలనివుందా?'

'ఆ! చెప్పనక్కరలేదు- నేను విననక్కరలేదు.'

'నా కోరిక మన్నించు కుమార్! నోరువిప్పి అడిగినందుకయినా కనికరించు. ఎన్ని ఉత్తరాలు వ్రాసినా తెలియనట్లు నటించేవు. పోనీ చిన్నవాడవని- తెలియదేమోనని- సిగ్గు విడిచి చివరకు నోరు తెరచి

చెప్పాను. అంగీకరించవూ' అంటూ ప్రాధేయపూర్వకంగా జాలిగా అడిగింది.

'కాంతం! నీ కెప్పుడైనా అటువంటి అవకాశ మిస్తే క్షమించు.'

'కుమార్, నామాట వినవూ! నన్ను వ్యభిచారిణిగా భావించకు. నీపై వున్నా మక్కువయే నన్నింతవరకూ తెచ్చింది.'

'పవిత్రమైన దేవాలయంలో యివా మనకు మాటలు ?'

'పోనీ, బయటకు వెళదామా !'

'వద్దు కాంతం. నా అంతరాత్మ అంగీకరించదు.'

'అంగీకరించేలా చేయనా ?'

'ఎందుకులే నీ కాశ్రమ. అయినా కాంతం! నీ కిటువంటి కోరిక పుట్టటం అన్యాయం. నాకన్నా పెద్దదానవు. నీ ముందిటువంటి మాటలు మాట్లాడటానికికూడా- చివరకు నీముఖం చూడటానికికూడా నాకు సిగ్గుగా వుంటుంది. నీయందు నాకు సోదరభావంతప్ప మరె భావం లేదు.'

'అయితే, యింక అడగవద్దంటావు.'

'క్షమించు కాంతం, నా కటువంటి ఉద్దేశ్యం లేదు.'

'అంతేనా ?'

'చెప్పానుగా.'

'పోనీ కుమార్! యీ మన సమావేశం మూడవ మనిషికి తెలియకుండా వుంటుందా ?'

'ఎంతమాట కాంతం! నీలో యిటువంటి సాత్వికమైన మార్పు వచ్చినందుకు నా ధన్యవాదాలు. మా అక్కగారి మర్యాద కాపాడటం నావిధి గాదా!'

'కృతజ్ఞురాలును- నమస్తే' అంటూ వెళ్లిపోతుంది. కుమార్ కూడా వచ్చి తక్కిన మిత్రులను కలుసుకున్నాడు.

బహుశా అది యొక కార్తి అయిఉండాలి. లేకపోతే కామం అంతగా వుద్రేకించియుండదనుకుంటాను. రోజులు గడిచిపోతున్నాయి. అనవసరంగా కాలం వెళ్లిపోతుంది. చిట్టెమ్మ యిది సహింపలేక పోతుంది. అదేమిటో కుమార్ స్కూలులో ఉన్నంతసేపు ఎంతో మర్యాదగా అప్యాయంగా మాట్లాడుతాడు. కాంపౌండు దాటితే బిగ్గరబిగిచి పిలిచినా ఉలకడు- పలుకడు- చివరకు తిరిగైనా చూడడు. ఇంక ఊరుకుంటే లాభం లేదనుకుంది. తాను కాపుల పిల్లే- కుమార్ కూడా కాపులకుర్రాడే- అందుకని యెలాగయినా వలచి వలపించుకొని పెళ్లి చేసికోవాలని యూహ. మంచి తెలివైనవాడు. మీాదు మిక్కిలి అందగాడు. పైగా తనకు లేకుండా- ఇంట్లో వంటలుచేసే బ్రాహ్మణులపిల్లఅనుభవించేస్తుందే అన్నా బాధ-

కుమార్ వంటరిగా పడుకుని నిద్రపోతు న్నాడు. అతని కెందుకో అప్రయత్నంగా మెలకువ వచ్చింది. అతని దేహాని కేదో- మెత్తటి- వేడిపదార్థం తగులుతూంది- కొంచెందూరంగా జరిగేడు- మరింత దగ్గరగా వచ్చిం దాపదార్థం. అతని ఆశ్చర్యానికి అంతులేదు——

'ఎవరూ ?'

'... ... ...'

'శేషా-'

'... ... ...'

'లక్ష్మీ—'

'... ... ...'

'ఎవ రంటే మాట్లాడ రేం ?'

'నేను కుమార్ —'

'నే నంటే- నీ పేరు—'

'నేనూ, చి - ట్ట - మ్మ - ను' అనీఅనడంతోనే తువ్వాన లేచి- లైటువేసి- 'చిట్టమ్మా-'

'ఎంతకాలానికి నామీాద దయవచ్చింది కుమార్.'

'అన్నివిషయాలు రేపుదయం మాట్లాడుకుందాంగానీ- అసలు యీా అర్థరాత్రివేళ యెలావచ్చావు- ఎందుకొచ్చేవు?—'

'గేటుతలుపులు వేసివున్నాయి. గోడ యెక్కి- దూకి వచ్చేశాను.'

'అవును- నీవంతటిదానవే కాని, యెందుకొచ్చావని-'

'ఏం రాకూడదా? నిద్రపట్టక- యిలా వచ్చాను- పోనీ నీవయినా యేదైనా సాధనం చేస్తావేమోనని-'

'నేను డాక్టర్నయితే మత్తుయింజక్షనయినా జేస్తును.'

'అసలు చేయాలనివుంటేసరి.'

'లేదని తెలిసిఉండీకూడా రావటం పొరబాటు.'

'కుమార్- యింత నిర్దయా!'

'చిట్టమ్మా- యీామాటలన్నీ అనవసరం.'

'అవసరమైనమాటలు నేర్పరాదూ-'

'నాకు చేతగాదు.'

'నేను నేర్పనా?'

'తమ గురుత్వ మెవ్వరూ కోరడంలేదు.'

'కుమార్- నామాట మన్నించవూ- నా ముద్దు చెల్లింపవూ- ఎందు కింతగా ప్రాధేయపడుతున్నానో ఆలోచించు- మన మిద్దరం...'

'చిట్టమ్మా- వెంటనే మర్యాదగా వెళతావా లేదా?'

'ఊ! లేకపోతే! ఏం జరుగుతుంది?'

'ఏదైనా జరుగుతుంది. ఎంత అల్లరయినా అవుతుంది.'

'ఏం ఆడదానిలా కేకలు వేస్తావా?'

'నీవంటి మగరాయుడు తగులుకుంటే యేంజేయాలి?'

'ఏం! నీవు పురుషుడవు కావా? పురుషత్వం లేదా?'

అతను తల వంచుకొని మాట్లాడడు. మౌనం అర్ధాంగీకార మనుకుని దగ్గర జేరి— 'కుమార్ - ఒక యింతి తనంత తా వలచివచ్చిన చులకనగా చూడటం న్యాయమూ!' నిన్ను చూచిన కన్నులతో మరొకమగవాడ్ని చూడబుద్ధిపుట్టదు సుమా- అందుకనే వేణు యెంత ప్రాధేయపడినా నే నంగీకరించలేదు—'

'నాకూ, వాడికీ పోలికా?'

'కాదు- కాబట్టే, నిన్ను పురస్కరించుకొని వేణుని తిరస్కరించాను.'

'అయ్యో పాపం! ఎంత పొరపాటు జరిగింది. ఇప్పటికైనా పశ్చాత్తాపపడి- తిరస్కారతప్పిదాన్ని నమస్కారపూర్వకంగా మన్నింప వేడుకో.'

'కుమార్- యీ సూదిపోటుమాటలన్నీ యెందుకు- ఏదో వచ్చాను... ... ...'

'ఊ! వస్తే- ఏంచేయమంటావు?'

'పాపం! ఏమీయెరుగనట్లు అడుగుచున్నావే!'

'ఎరిగివుంటే అడగడమెందుకు?'

'ఆమాట నానోటంటనే రావాలనా?'

'ఏది వచ్చినా నీనోటంటనే వస్తూంది.'

'అలాగా' అంటూ అతనిమీదికి వాలిపోయింది. ఒక త్రోపు త్రోస్తాడు. దూరంగా పడి కోపంగా 'కుమార్—'

'ఇంక మాట్లాడకు- బయటకు పో-'

'వినవుకదూ-'

'వినను—'

'తొలిసారి'

'కాదు- కడసారే'

'ఫలితంపొందని ప్రేమ పగగా మారుతుందని తెలుసా?'

'ఆ! తెలుసు- అది తుచ్ఛమైన ప్రేమనికూడా తెలుసు-'

'స్త్రీహృదయం నవనీతానికన్నా మెత్తనిది- బండరాయికన్నా కఠినమైనదీ అని తెలుసా-'

'ఆ! తెలుసు- తెలుసు-'

'స్త్రీ బొంకితే గోడకట్టినట్లని తెలుసా?'

'ఆ! ఆ! అన్నీ తెలుసు-'

'తెలిసిఉండేనా- నీగోతిని నీచేతులతో నీవే త్రవ్వుకుంటున్నావు'

'కాదు- నా శీలసౌధాన్ని నిర్మించుకోటానికి పునాదులు వేసుకుంటున్నాను.'

'ఇప్పుడు నీవే బలవంతపెడుతున్నట్లు అల్లరిచేస్తే-'

'ఓ! నీయిష్టం- నా కటువంటిభయ మేమీలేదు- కాకపోయినా నాయింటికి నీవు వచ్చావు గాని, నీయింటికి నేను రాలేదుగా-'

'అయినా చూద్దాం- పాఠం చెప్పమనివస్తే, బలవంతంచేస్తున్నాడంటాను. ఇదిగో నాపుస్తకంకూడా పట్టుకొనివచ్చాను—'

'ఈ అర్థరాత్రివేళ పాట మేమిటి? యెవ్వరూ నమ్మరు.'

'నమ్మించేపూచీ నాది' అన్నా ఆమె కంఠంలోని కర్కశధ్వని అతనికి కొంత అదురు, అనుమానం కలిగించకపోలేదు- తలవంచుకొన్నాడు. ఆలోచిస్తున్నాడు- తల పంకించి, లేచి నవ్వు తెచ్చుకొని 'అబ్బ! ఎంతబలవత్తరమైన ప్రేమ చిట్టమ్మా నీది- నీ ప్రేమలోతులు చూదా......' మాట కాకముందే చిట్టమ్మ ఆరాటం ఆపుకోలేక-

'అబ్బా! ఎంతటివాడవోయి కుమార్ - ఇంతసేపు వ్యర్థంగా...' అంటూ అతనిని తనఒళ్లోకి లాక్కుపోయింది.

'ఉండు చిట్టమ్మా, వదలు- బయటకు వెళ్లి రావాలి.'

'ఊ- త్వరగా రా!'

అతను బయటకు వెళ్లేడు- ఆమె లోపల వుంది. వెంటనే అతను బయట గొళ్లెం పెట్టేశాడు. చిట్టమ్మ ప్రాణం నిలువునా కూలిపోయింది. కుమార్ మేష్టారును లేపి సంగతినంతా చెప్పారు. మేష్టారు, చిట్టమ్మను చీవాట్లు పెట్టి పంపించేశారు! చిట్టమ్మ, చావలేక బ్రతకలేక నడచిపోయింది—

ఆమరునాడు వీధిలో పెద్దగొడవ!

అసలుగొడవ అణగారిపోయింది.

ఇది రెండవ గొడవ!

నేను ఉత్తరం వ్రాసి చిట్టమ్మ కిమ్మన్ని వాళ్ల దాసీదాని కిస్తే అది పొరపాటున కాంతాని కిచ్చింది. దాసితో అంటుకుంది. నలుగురూ నాలుగువిధాల అన్నారు. పైగా దాసు పిన్నిను తన దని, ప్రెజెంటేషు నని, పంపించాడు. నేను అంటే అందరకూ అసహ్యం వేసింది. ఏలాగయితే మేష్టారు- దాసు- కుమారు గొడవ చల్లార్చేరు. కుమార్ చెప్పగానే కాంతం మరి తిట్టడం మానేసింది- ఎందుచేతనో!

చిట్టమ్మమాత్రం అవమానంతో కృంగిపోతూంది. ప్రతిక్షణం అదే ఆలోచన! తాను కుమార్ నెందుకు ప్రేమించాలి- నేను నెందుకు ద్వేషించాలి? అదే అర్థంకావటంలేదు. కడకొక నిర్ణయానికి వచ్చింది.

'అందని పండ్లకు ఆశిస్తే లాభమేమిటి? దురాశపడి నిరాశ చెందేకంటే, ఉన్నదానిని అనుభవించటం న్యాయంకాదా! అవును- నేను తిరస్కరించి తత్ఫలితంగా తిరస్కరింపబడ్డాను—'

అదే ఆమె అంతరాత్మ కనుగొన్న సత్యం.

ఇప్పుడామె వేణువైపు మొగ్గింది- వేణుని ప్రేమిస్తుంది. అది ప్రేమ అనేకంటే కండ్లులేనికామం అనటం బాగుంటుందేమో!

వేణుతో నుండటంమాత్రం నిశ్చయం. తర్వాత తన పరాభ వాగ్ని చల్లారటానికి ప్రతీకారం—??? 'ఏంచేయాలి?' అన్నా ప్రశ్నతో రోజులు గడిచిపోతున్నాయి. చివరకు ఒక నిశ్చయానికి వచ్చింది— ఏమిటది?

'శేషా- కుమారులను విడదీయాలి!

కుమార్ ని నాశనంచేయాలి!

వారి నాశనం చూచి ఆనందించాలి!

వారి ప్రేమసౌధాలను నేలమట్టం గావించి ఆస్థలంలో తన భవ నాన్ని నిర్మించుకోవాలి!

వారి జీవనలతికలను మొదలంట పెకలించి నలిపి నాశనం చేయాలి!' అది ఆమె కడసారి మనోనిశ్చయం.

అది కొనసాగుతుందా?

ఏమో ఏం చెప్పగలం? ఎవరిలో యెటువంటి మహత్తరమైన శక్తు లున్నాయో!

# 5

దసరాసెలవు లనంతరం ఆవేళ క్రొత్తగా స్కూలు తెరచేరు. స్వగ్రామం వెళ్లిన మిత్రులంతా తిరిగి చేరుకున్నారు. ఆనాడు వారికి ఆటవిడుపు. ఆ సాయంకాలము విద్యార్థులంతా గోదావరి యొడ్డున వేళారు బాతాఖానీ- ఇంటిదగ్గర లక్ష్మి పూలుకోస్తూ పాడుతుంది—

కోసికొనుమ యీ కోమలకుసుమము
జాలముసేయకు ధూళి గలియుగా॥ కో॥
యౌవనకాంతులు మాయకముందే
మధుబిందువు లవి ఇంకకముందే॥ కో॥

సంధ్యారాగము అనురాగముగా
ప్రేమామృతమై వెలిగెడువేళ॥ కో॥

'ఎక్కడదే లక్ష్మీ! ఏదో క్రొత్తపాట పాడుతున్నావు.'

'మా అక్క పుస్తకంలోనిది.'

'ఎవరు వ్రాశారు?'

'కుమార్—'

'కుమారా!—'

'అవును, యెందు కలా ఆశ్చర్యపోతావు? ఇంకా చాలా వ్రాశాడు, మా అక్క పుస్తకంలో- పాటలు'

'నాకుకూడా వ్రాసిపెడతాడేమో-'

'ఏమో! పెట్టడంసంగతి నాకు తెలియదుగాని, వ్రాస్తాడని చెప్పగలను—'

'చాల్లే- వూరుకో- అన్నీ యిటువంటిమాటలే!' అంటూ లక్ష్మిని పట్టుకుంటానికి పరుగెత్తబోయింది. శారద ఒళ్లోనుంచి ఏదో పొట్లం జారి క్రిందపడింది.

'శారదా! అదేమిటే- ఏమిటో పడుతున్నాయి, నీ పమిటిలో నుంచి—'

'ఉస్! మెల్లిగా- మా అత్తమ్మగాని వింటూంది.'

'ఏమి టాపరమరహస్యం—'

'ఇవి కుమారు కందచేయాలి.'

'నాకు తెలియదు బాబూ- నీవే పట్టుకెళ్లు.'

'ఏం- మీ అక్క తిడుతుందా?'

'మధ్యను మా అక్క కెందుకు? తిట్టించుకున్నా- కొట్టించుకున్నా మీాకే కావలసింది ప్రస్తుతం—'

'లేకపోతే- కుమార్ ఏమైనా అన్నాడా?'

'ఇంతకుముందు చీటీ నిచ్చావని యిస్తే చాలా తిట్టాడు- నిందించాడు కూడాను—'

'సరే! గదిలో యెవరున్నారేమిటి, తలుపుతీసివున్నట్టుంది.'

'ఎవరూ లేరు. అది యెప్పుడూ తీసేవుంటుంది.'

శారద ఒక చీటీని ఆ పొట్లాన్ని గదిలో పెట్టి వచ్చేసింది అమాయికంగా-

ఇంతలో వేణు వచ్చాడు- శారద గుండెలు ఝల్లుమన్నాయి. గదిలోకి వెళ్లాడు- శారద కళ్లు చీకట్లు క్రమ్మాయి. నిలువెల్లా ముచ్చెమటలుపోసి నిలువునా నీరైపోయింది- కాని యింతలో దాసుకూడా వచ్చాడు- శారదకు కొంత ధైర్యం చేకూరింది. ఎందుకోమరి! దాసు సంగతి- దాసూ, కుమారుల స్నేహం తెలిసివుండికాబోలు—

"గదిలో"

దాసు పొట్లం విప్పి చీనామితాయి తింటున్నాడన్నమాటేగాని అతనేదో చాల దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు— మొగం వికసించింది- చిరునవ్వు మొలకలెత్తింది- ఎందుకో- ఏం యెత్తువన్నాడో! అది యెటువంటి ప్రతిఫలం ప్రసాదిస్తుందో మరి!

'దాసూ! చూడరా యీ లెటరు.'

'ఎందుకులే నీ లవ్ లెటరు నేను చూడడమెందుకు?' మొట్టమొదటే ముందరికాళ్లకు బంధం వేశాడు.

'నాది కాదురా బాబు-'

'పోరా! నీది కాకపోతే యింకెవరిది? నేను పశువుల ఆసుపత్రి దగ్గరనుంచి చూస్తున్నాను. నీవు రావటం చూచి శారద తొందరగా వచ్చి యిక్కడ పెట్టింది.

'ఏమో- కుమార్‌కు పెట్టకూడదూ!'

'ఏడిచినట్టుగానేవుంది నీ తెలివి! నీవు రావటం చూచి అంత వరకు ఆగి, అతని వుత్తరం నీచేతి కందిస్తుందా?'

'అవును, ఆమాటా నిజమే! కాని యింతకుముందు నా కేమీ వ్రాయలేదే! ఇందుమాత్రం 'ఎన్ని ఉత్తరాలు వ్రాసినా జవాబియ్యవే' అని వుంది మరి-'

తిరిగి ఆలోచనలో బడ్డాడు దాసు- అయి తిరిగి నవ్వుతూ—

'చూశావురా వేణూ! అయితే నీ యుత్తరాలన్నీ కుమార్ సంగ్రహిస్తున్నాడన్నమాట —'

'అదే అయివుండాలి! శేష నాకు వ్రాసిన ఉత్తరాలుకూడా తాను దాచేస్తున్నాడు. పైగా తనకూ, శేషకు సంబంధముందని చెబుతాడంట—'

దాసుకు నవ్వు ఆగకుండా వుంది.

'పాపం- అనవసరంగా- కుమార్ కోతలు నమ్మి, శేషను బాధపెట్టేను- నే నేమీ యెరుగను బాబోయ్- నీవే నా ప్రాణం- దైవం- అంటుంది.'

ఇంక నవ్వు నాపలేక దాసు వికటంగా నవ్వుతూ—

'మరేరా అన్నీ ఇటువంటి కోతలే వాడివి.'

'ఇప్పటికయినా నిజం గ్రహించావు. అంతే చాలు.'

'ఆ! ఎప్పుడో గ్రహించానురా వేణూ, నిజం!'

'ఏరా_ దాసూ! ఎందుకురా కుమార్ అలా కోస్తాడు అనవసరంగా- ఏంలాభం వాటివల్ల?'

దాసు నవ్వలేక నవ్వుతూ-

'రామ రామ! ఎంత ఘోరం! అటువంటి కోతలరాయుడు ఈ సంవత్సరం తప్పక ఫేలవుతాడు.' వేణు ముఖం మాడిపోయింది. అటువంటివి కనిపెట్టటానికి దాసు ఆరితేరినవాడే!

'ఎందుకులేరా, దాసూ! అటువంటివి మన కెందుకు- ఎవరి ఖర్మాన వాళ్లే పోతారు.'

'అవున్లే- అవన్నీ మన కెందుకు ?- ముందు శారదా దేవి మదన తాపం చల్లార్చు—'

'నిజంగా ఈ ఉత్తరం నాదే నంటావా ?'

'ఓరి వెఱ్ఱివాడా—'

'అయితే ఏంచేద్దాం ?'

'రాత్రి ఖచ్చితంగా వెళ్లిపోవటమే-'

'అయితే సరే! హుషార్—'

'బహుత్ హుషార్! వీధిగదిలో పడుకుంటుంది.'

'అవును, నాకూ తెలుసు-'

'మరి శేష పని- పాపం !

'ఫరవాలేదు- ఒక్కరాత్రికేగా'

దాసుకు నవ్వూ- అసహ్యం ముంచుకువస్తున్నాయి.

'కాదు- తెలిస్తే నిన్ను ఏమంటుంది ?'

'అవును- చాలా నిందిస్తుంది తెలిసిందంటే'

'కాని శేషకు అటువంటి అసూయ లేదనుకుంటాను.'

'నీ కేం తెలుసు- మోసేవాడికి తెలుసు కావిడ బరువు— మొన్నను కాంతంతో మాట్లాడేవని పెద్ద బెట్టుసరి- బెదరింపును-'

దాసు పొట్ట పగిలిపోతూంది, నవ్వును భరాయించలేక- ప్రయత్నపూర్వకంగా ఆపుకుంటూ-

'నీకు వీళ్లంతా ప్రియురాండ్రే అనుకుంటాను.'

'నిజంగా- దాసూ! వీళ్లతో వేగలేకపోతున్నా ననుకో-'

'నీ కేంరా! రంగడుకుచ్చు—'

'ఎందు కలా నవ్వుతావు ?'

'కాదు- ప్రపంచంలో ఎటువంటి మనుష్యులు- ఎటువంటి నాలుకలు- ఎటువంటి కోతలు- అబ్బా! అవన్నీ వ్రాయాలంటే కాళిదాసే వుండాలి.'

'అయితే, నావన్నీ కోతలంటావా?'

'బాగు బాగు- గుమ్మడికాయలదొంగ అంటే భుజాలు తడుము కుంటా వెందుకు?'

ఇంతలో అసలు ముఠాఅంతా అక్కడకు చేరుకుంది. అందుచే సంభాషణ మారిపోయింది. కాని మసిపట్టిన కాఫీపిడతలాంటి వేణు ముఖం- తోమిన మరచెంబులాంటి దాసు ముఖం చూచి ఏదో వున్నట్లు కుమార్ కనిపెట్టకపోలేదు- కొంతసేపటికి వాళ్లలోవాళ్ల కేదో వాగ్వాదాలు బయలుదేరాయి. చాలా గొడవబడుతున్నారు. ఇంతలో మేష్టారు వచ్చారు- 'ఏమిటో అసలు విషయం' అంటూను.

'వినండి మేష్టారు, మొన్నటి క్వార్టర్లీయియర్లీ పరీక్షకు తెలుగు, ఇంగ్లీషు ఫస్టుమార్కు సంపాదిస్తానని ఛాలెంజి చేశాడు కుమార్.'

'అయితే ఏమయింది?'

'అన్నామాట నెగ్గించుకున్నాడంటోయ్! అందులోను కుమార్ అన్నాడంటే అలా జరిగితీరవలసిందే.'

'కంగ్రాట్యులేషన్స్— కుమార్'

'అతనికంటె ఘనుడు ఆచంట మల్లన్న- అన్నట్లు నాకన్నా యెక్కువేనండి దాసు- ఎలిమెంటరీ ఆప్షనల్ మేథమెటిక్సు ఛాలెంజీ చేసినవాడు- పైగా జాగ్రఫీకూడా కొట్టాడు.'

'భేష్- అలాగుండాలోయ్ చదువు కాంపిటీషనంటేను- అందరూ ఒక సబ్జక్టుకే పోటీపడక తలోటీ కాంపిటీటు చేయాలి. మొత్తం మీద మన రూమంతా 'ఫైన్' అయిపోతుందన్నమాట.'

'ఆగండి, మేష్టారు! అసలు ఆసామీ వేణు... ...'

'ఏం తక్కినవన్నీ అతని వేనా ఏమిటోయ్ రామం!'

'అవుననుకుంటాను- ఆ కడనుంచి-'

అందరూ నవ్వుతారు. వేణు బిక్క-మొగంతో—

'ఏమో వస్తుందనుకున్నాను. కష్టపడి చదివేను- రాలేదు. మరి ఏంచేయమంటారు ?'

'ఏం- ఇది రన్ మోర్ అనుకున్నావా ?' ఆచారి

'ఎందుకు ?' మూర్తి

'దొబ్బబెట్టటానికి' రామం

'కాదురా, అడ్డాటనుకున్నాడు' రాధాకృష్ణ

'సలాంచేయటానికా' దాసు

'బాగా లెక్క-గట్టావురా, దాసు'

'ఉ- మరేమనుకున్నావురా రామం! దాసుగారిది ఆప్షనల్ మేథమెటిక్స్ అని తెలుసా ?'

కుమారు, మేస్టారు నవ్వలేకపోతున్నారు. 'ఏమోయి దాసూ నీ ఆన్సరు 1950 సిద్ధాంతమా ?'

'కాదండీ మేస్టారు! హేర్స్ యోపరేటస్ మీద, బోయల్స్ లా ప్రకారం వచ్చిన రిజల్టండది' అన్నా రాధాకృష్ణ మాటలు వాళ్ల నవ్వును బయటపెట్టేయి. వేణు చిన్నతనాన్ని రగుల్కొ-ల్పేయి.

'1942 లో హిట్లరు యీ సూత్రంప్రకారమే నట బాంబులు తయారుచేసింది.' అన్నా ఆచారి మాటలకు మేస్టారింక నవ్వలేక కడుపు చేత్తోపట్టుకుని లేచిపోయి- - -

'బాగుందోయ్- మొత్తానికి మీ మీ గ్రూప్పన్నీ యేకరువు పెట్టేశారు-'

'గోదావరిజెట్లాగదాండీ! ప్రశస్తమైన వరిబియ్యం తింటూ తెలివితేటలు సంపాదించారు కుర్రాళ్లు.'

'శంకరం- ఈసారి సరిపోయిందోయ్ !జాగ్రఫీకూడా అయిపోయింది'

'ఇంకొకటి మిగిలిపోయిందండీ మేష్టారు!' దాసు

'ఏమిటది...... డబ్బా—' రాధాకృష్ణ.

వెంటనే వేణు 'వెరీ సీరియస్' అయిపోయి—

'ఇటువంటి వెధవకబుర్లు చెప్పావంటే- పళ్లు రాలతాయి- తెలుసా-'

అందరూ తిరిగి గొల్లుమంటూరు.

'ఏం- డబ్బా అంటే నీకంత ఉలుకెందుకోయ్-'

'కలసెకు సంశయంబునకు కారణమన్నది పైటులేగదా' అన్నా దాసు మాటకు తిరిగి వికవికలు పకపకలును.

'అబ్బా- ఎందుకొచ్చినగొడవోయ్! ఈపాటికి భోజనాలకు వెళ్లిరండి-' అంటూ మేష్టారు వెళ్ళిపోయారు—

'మరలా సంభాషణ మారిపోయింది.

'ఏరా- వేణు నీ కేమన్నా ధైర్యముంటే డైరెక్టుగా అడగాలి గానీ- ఇదేమిటి యీ వ్రాతలు—'

'పోనిలే ఊరుకో రామం-'

'కుమార్- నీకు తెలియదు- ఊరుకోవటంకాదు. పైగా నా పిన్నీసు దానికి పంపించి నే నేమయిందా అంటే- ఏమో నాకు తెలియదని ఖయ్‌మన్నాడు.'

వేణుముఖంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు—

'పోనీలెండోయ్- అయిపోయిందానికి గొడవెందుకు-' అన్నా కుమారు మాటమీద అందరూ వూరుకున్నా- వేణువైపు చురచురా చూస్తున్నారు- కుమార్, దాసు కేదో కనుసంజ్ఞ చేశాడు. దాసు చిరునవ్వుతో—

'ఒరే! నే నొక ప్రశ్న అడుగుతాను- ఎవ్వరైనా సమాధానం చెప్పాలి.'

'నీ వెక్కడరా, దాసూ! నీవు వెయ్యిళ్ల పూజారివి. ఏయింటిలో కథ అడుగుతావో—'

'కాదు- అది చెప్పగలవారు మనలోనే వున్నారు.'

ఇంతలో శర్మ ప్రవేశం- వచ్చీ రావటంతోనే—

'ఒరే- ఎప్పుడూ అబద్ధమాడలేదని చెప్పగలమొగాడున్నాడా యిక్కడ?'

'అవసరమొస్తేనేగాని అబద్ధమాడనని చెప్పగలను.'

'చాల్లే- తగ్గరా కుమార్'

'వేణు చెప్పగలడేమో !'

'నీ కానకాల్తనాము యెందుకు ?'

'కోప్పడకురా వేణు- పోనీ యెన్నడూ దొంగతనం వేయలేదని చెప్పగలరా ?'

'ఓ- నిక్కచ్చిగా, కొబ్బరిబొండాలు- దానిమ్మపండ్లు- గులాబి పూలు తప్పించి' దాసు

ఆ మాటకు అంతా నవ్వుతున్నారు. అర్థం తెలిసి దాసూ, కుమారులు నవ్వుతున్నారు, అర్థంలేక నవ్వుతున్నారని శర్మ, రాధా కృష్ణ నవ్వుతున్నారు- నవ్వకపోతే బాగుండదని బాబులు నవ్వుతున్నాడు ఏమన్న రావడంలేదని వేణు నవ్వుతున్నాడు- నవ్వులు కొంత చాలించి-

'అబ్బా! నీ వేమిటోయ్ శర్మ- పానకంలో పుడకలాంగ- చొప్పదంటు ప్రశ్నలూ నీవూను— ఊఁ- నీ ప్రశ్న కానీయరా దాసూ' అన్నా మాటపై దాసు యీవిధంగా చెప్పాడు—'

'నేను- జ్ఞానం వచ్చినతరువాత- ఏపిల్లను బలవంతంచేయలేదు- ఆమె అంగీకరించకపోతే నేను పశుబలంతో ఆమెను పట్టుకొని, జాకట్టు చింపివేయలేదు- చివరకు ఆమె కేకలుపెడితే పారిపోలేదు— అని మీరందరూ ప్రమాణకం చేయాలి !

'ఓ ! అందరం చేస్తాము.' వేణు మాట్లాడడు-

'వేణు చేయడేమో !'

'నామం- బుద్ధివున్నవాళ్లయితే అనవసరంగా నామాట నెత్త కండి' అంటూ బయటకు వెళతాడు.

ఇంతలో మేస్టారు భోజనంచేసి మరలా వస్తారు.

'ఇంకా కాలేదటోయి మీ ప్రశ్నలు- సమాధానాలు-'

'ఆ! అయిపోయాయండి.'

'అయితే యీవేళ సెకండు షో పిక్చరుకు వెళదామా-'

'ఏమిటండి పిక్చరు?'

'ప్రతిఫలం- చాలా మంచి పిక్చరు.'

అందరూ అంగీకరించారు. కాని వేణుమాత్రం మాట్లాడలేదు- కుమార్ కనుసైగపై —'

'ఏమోయ్! వేణు నీవు రావేమిటి?'

'రానండీ! హెల్తు బాగుండలేదు.'

'అవున్లెండి- వాడు రాడు- ఎందుకొస్తాడు?'

'అదేమిటోయ్ దాసూ!'

'దానికంతా ఉంది లెండి' అంటూ వేణువంక చూస్తాడు. వేణుకూడా దాసువంక చూస్తాడు, దాసు నెమ్మదిగా 'హుషార్' అంటాడు. వేణు ముఖం ఆనందంతో తళుక్కుమంటుంది.

వెన్నెల్లో నవయువకుల సైకిలు ప్రయాణం- దారిలో దాసు, 'మేస్టారూ, కుమార్! ఈవేళ మన యింటిదగ్గర నుంచి గమ్మత్తు జరుగుతుంది.'

'ఏమిటది?'

'మీరే చూతురుగాని-'

'అరే! మనం వచ్చేశామే-'

'మనం అక్కడ నుండకూడదు లెండి'

'ఏమిటోయ్ అది !'

'చెబుతాను గదా—'

... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ...

రాత్రి సుమారు 2 గంటలు దాటివుంటుంది. శారదాదేవి యింట్లో అకస్మాత్తుగా పెద్ద అలజడి. 'దొంగ దొంగ' అని కేకలు- చుట్టుపట్లవారంతా లేచి చుట్టూమూగేరు. 'దొంగ దొంగ- పట్టుకోండి పట్టుకోండి' అందరూ ఒకటే గొడవ !- 'దొరికేడు- దొరికేడు'— 'కొట్టండి- తన్నండి' అంటూ చుట్టూ మూగేరు. కాని దొంగను చూచిన ప్రతివాడు ముక్కుమీద వేలుపెట్టుకొని, నాలుక కరచు కుంటున్నాడు. ఎందుకో! ఇంతలో మనవారుకూడా సినీమానుంచి తిరిగి వచ్చేశారు. ఆ జనాన్ని చూచి అంతా ఆశ్చర్యపోతూంటే, దాసు మాత్రం నవ్వుతూ 'అనుకున్నంతపనీ జరిగింది' అంటూ అసలుసంగ తంతా చెప్పి, తానిచ్చిన టోకడా వివరించాడు- చివరకు తేలిందేమి టంటే 'వేణు, శారద అనుకుని వాళ్ల అత్తగారిమీద పడ్డాడట- ఆమె దొంగని కేకలుపెట్టింది.'

# 6

అది సంధ్యాసమయం. అరుణకిరణాలతో సూర్యభగవానుడు ప్రకృతికాంతకు ఫేషనులు దిద్దుచున్నాడు. వాకటిలో పచార్లుచేస్తూ లక్ష్మి పాడుతూవుంటుంది.

నే డుదయించిన కోమలకుసుమము
రేపటి కేమగునోయి—
ఈ ప్రభాతమున పూచిన పూలు
సంధ్యావేళను రాలిపోవుగా-

నిన్నటికిన్ మరి యీ దినమునకూ
తారతమ్యమే కనుగొనలేవా ?—

'ఏమిటి లక్ష్మీ! నా పాటలన్నీ నీవే పాడేస్తున్నావు'

'ఏం మా అక్కేగాని నేను పాడకూడదా?'

'పాడకూడదు.'

'ఏం- ఎందుచేత ?'

'ఇప్పుడు చెప్పినా నీకర్థంకాదు. అర్థమయ్యే అదను వస్తే అప్పుడు చెబుతానులే-'

'పోనీలే! పాడనులే- అదిగో మా అక్క పాడుతుంది.'

లోపలినుంచి శేష పాట—

ముద ముదయించెనుగా- యీ వేళ॥ ముద॥
ప్రియుని కౌగిట - అలసి సొలసి
హాయిని పొందెదగా - యీ వేళ॥ ము॥
భాగ్యమటన్నది - నాదా, కాదా ?
అనుభవమన్నది - నేడే కాదా!

ఇంతకుముందే వచ్చి వెనకాల నిలువబడ్డా దాను—

'హుషారా ! పాటలోనే- కాపన్'

'పసిక ట్టేవ్- ఈ వేళ పడుకోటానికి రాదు-'

'బహుత్ హుషార్! ఇదే ప్రథమకలయిక అనుకుంటాను.'

'అవును- ఇదేమవుతుందో!'

'ఫరవాలేదు- దేవుడు మీకు అనుకూలుడగును గాక !'

'థ్యాంక్సు-'

కవికుమారుకు క్షణాలు యుగాలులాగ గడుస్తున్నాయి. ఎప్పు డెప్పుడా అని యెదురుచూస్తున్నాడు. అదియే తొలిసారి ! అందులోను రెండు మూడు సార్లు ముక్తసరికివచ్చి మోసగించిన విషయ మది-

చేతిలోనుండిరేమే నోటికందని దివ్యఫలం, నే డందుతున్నాదంటే- ఆ పవిత్రపర్వక్షణముకోసం ఏ హృదయం తహతహలాడదు ?

పండువెన్నెల పిండారబోసినట్లుంది. వచ్చీరాని శీతకాలపు చిరుగాలులు కుమార్ వేడిరక్తానికి చక్కిలిగింతలు పెడుతున్నాయి. వీధి అరుగుమీద బెడ్డింగునిండా గులాబిపూలు పరచుకొని నిద్రపట్టక కొట్టుకుంటున్నాడు కుమార్. ఎదుటి అరుగుమీదనున్నా రూములో వేణు పడుకున్నాడు. సుమారు తొమ్మిది గంట లవుతుంది. ఏదో పాదాలచప్పుడు పసిగట్టిన కుమార్ బిగిసిపోయాడు. శేష పిల్లి అడుగులు వేసుకుంటూ వచ్చి కుమార్‌కు చక్కిలిగింతలుపెట్టింది. కాని కుమార్ చలించలేదు—

'కుమార్—'

'... ... ...'

'కుమార్- కుమార్-'

'... ... ...'

'మెలుకువగానున్నవాళ్లను ఏలా లేపగలం ?'

'... ... ...'

'వెళ్లిపోతున్నా కుమార్'

'... ... ...'

'మరి సెలవు—'

అప్పటికీ కుమార్ మాట్లాడలేదు. శేష వెళ్లిపోతూంది. కాని కుమార్‌కు తెలుసు వెళ్లదని- వెళ్ళలేక రెండడుగులు వేసి వెనుకకు తిరిగింది. అతని చెక్కిలికి తన చెక్కిలి నానించి—

'కుమార్- ఒకసారి లేవవూ !'

'అబ్బా ! ఎవరదీ—' ఏమీఎరుగనట్లు

'ఉస్ ! గట్టిగా మాట్లాడకు'

'ఎవరంటే మాట్లాడరేం?'

'బాగుంది నీవరుస- ఇప్పుడా నీ కొంటెతనం!' అంటూ తన సన్నని వ్రేళ్లను అతనినోటి కడ్డంపెట్టింది. వెంటచే 'ప్చ్' అని శబ్దం.

'అంత గట్టిగానా-'

'చేసేది దాగుతుందా?'

'మాంసం తినేవాళ్లు ధుమ్ములు మెడలో కట్టుకుంటారా?'

'కట్టుకోకపోతే తెలియదా' అంటూ బెడ్డింగు రూములోకి మార్చేడు- ఇద్దరూ గదిలో పడ్డారు- లోపల గడియపడింది. ఆమెను నెమ్మదిగా దగ్గరకు తీసికొని—

'శేషా! నీవంటి వయోసౌందర్యవిలాసినిని, లావణ్యసుధా స్రవంతిని- సమయాసమయ యుక్తాయుక్తజ్ఞాన వివేకసంపన్నురాలిని నా అర్థాంగిగా పొందగల్గుట నా అదృష్టమే.'

'అప్పుడే అర్థాంగిని అయిపోయానా?'

'ఏం కాదా? ఇదే మనకు గాంధర్వవివాహం. పంచభూతాలు సాక్షిగా- పరమాత్మసాక్షిగా- నీ సాక్షిగా- నా సాక్షిగా- నీవే నా అర్థాంగివి- శేషా! నివే నా అర్థాంగివి' అంటూ ఆమెను తన కౌగిటలోనికి లాక్కుంటాడు.

'మాట్లాడవేం శేషా! నీ కిష్టంలేదా? నీవు బ్రాహ్మణకన్యవు- నేను కాపుల బ్రహ్మచారిని అని ఆలోచిస్తున్నావా?'

'ఎంతిమాట కుమార్! కుల మతాలు పవిత్రప్రేమకు అడ్డు రాలేవు. ప్రేమ బలవత్తరమైనది. ప్రేమ పరమాత్మ స్వరూపము- ప్రేమలేనిదే ప్రకృతియే లేదు- అని నివే చెప్పేవుగా! అందులోను- నీవంటి సుందరమూర్తిని- కళాకోవిదుని- రసికుని- ప్రేమపిపాసిని- నా భర్తగా పొందుచున్నానంటే, అది నే నెన్నో జన్మములనుండి చేసుకుంటున్న పుణ్యఫలమన్నమాట- ఎప్పుడూ నీ సాన్నిధ్యాన్నే

ఉండాలనీ, నీ అమృతోపమానమైన మాటలు వినాలనీ, నీ సుందర దివ్యమంగళవిగ్రహాన్నే పూజించాలని, నిన్నే ఆరాధించాలని నా మనఃపూర్వకమైన కోరిక- ఎప్పటికైనా నీవే పతివి! కుమార్ పువ్వునుండి వాసన వేరయినా, నీనుండి నేను వేరుగాను- కుమార్! కాని—'

'ఊ- ఏమిటి కాని?'

'నాకు పెండ్లిసంబంధాలు వచ్చాయి. అందుకనే మావాళ్లంతా మాట్లాడుకోవటానికి వెళ్లేరు- లక్ష్మి, నేను తప్ప నింకెవ్వరూ లేరు- కాబట్టే, యిప్పుడిలా రావటానికి వీలయింది.'

'అయితే నీ ఉద్దేశ్యం-'

'నేను వేరే చెప్పాలా?'

'పోని, యెందుకు శేషా! నాటివాడినే పెండ్లిచేసుకోరాదూ-' అని అనలేక అనలేక అన్నాడు. ఆమాటతో శేష త్రుళ్లిపడి—

'ఏమిటీ కుమార్! నీవేనా యీ మాటలూ-' జాలిగా-

'కాదు- శేషా!' మాట్లాడలేకపోతాడు.

'కుమార్! ఎంతమాటన్నావు- నన్ను యింకా పరీక్షచేస్తూరా? నీవు అంగీకరించినా- తిరస్కరించినా- ఇప్పటికయినా- ఎప్పటికయినా- నీవే భర్తవు- కుమార్ నీవే భర్తవు. నిన్ను విడిచి నేను బ్రతకను- బతకలేను- నీవు నిరాకరిస్తావా? ఈ పాపిష్ఠిలోకాన్ని విడిచి స్వర్గ ధామంలో ప్రేమసీమల పూచిన పూలమాలలుతో నీకై యెదురు చూస్తుంటాను.' అంటూ అతని కంఠాన్ని కౌగిలించింది. ఆమె వేడి కన్నీటిధార అతని బుగ్గలకు తగిలింది. ఆనందంతో ప్రతిరక్తనాళం ఉప్పొంగిపోయింది. అతని ఆనందభాష్పాలు వెల్లువలై ప్రవహిస్తున్నాయి. ఆనందం పట్టలేకపోతున్నాడు. ఆమెను పూర్తిగా తన కౌగిటిలో బంధించాడు. ఆమె అతని విశాలవక్షస్థలానికి హత్తుకపోయింది.

అటువంటి ఆనందంలో వారికి నోటంట మాట రానటంలేదు. అలా ఒకరి కౌగిలిలో ఒకరు ఎంతసేపున్నారో వారికే తెలియదు. ఇంతలో బయట అడుగులశబ్దం. శేష ఉలిక్కిపడి లేచి—

'కుమార్- కుమార్- చూడు ఎవరో వస్తున్నట్లుంది.'

'ఎవరై యుంటారు- దాసు రాడుగా'

'వేణు యిక్కడనే వున్నాడా ?'

'ఉ- అవతలగదిలో నున్నాడు.'

అంటూంటే, ఆ అడుగుల శబ్దం మరలా గదివైపు వినిపించి- అంతరించింది.

'ఏమైనా గొడవ పెడతాడేమో !'

'ఏడిచేడులే ! వాడి మా ఎవరకు లెక్క' అంటూ కుమార్ ఆమె ఎడమచెంపమీద తన కుడిహస్తంతో ఉరుమర్దనచేస్తూ- అధరామృతం గ్రోలి—

'శేషా- చందమామలాంటి నీ ముఖం- దొండపండులాంటి నీ అధరం- కలువ రేకుల్లాంటి కండ్లు- బొంగరాలవంటి నీ...'

చటుక్కున అతని నోరు కొక్కి- 'చాలు- చాలు మీ కవిత్వం కట్టిపెట్టండి. భట్రాజులాగ ఏమిటా స్తోత్రపాఠం- అటువంటిమాటలంటే నే నసలు యింక రాను- నాకు సిగ్గేస్తుంది.'

'తప్పేముంది- నిజం చెబుతున్నాను.'

ఆ ! చాల్లెండి ! మీ స్వభావోక్తి ! మన వివాహమైతే మరీ బాధనుకుంటాను నీతోటి-'

'ఏం ?—'

'ఏముంది- కాఫీ కాస్తే అమృతమంటావు- పువ్వులు పెట్టుకుంటే అజంతాశిల్ప సౌందర్యం- వంగుని తుడుస్తుంటే ఏల్లోరాగుహాలావణ్యం- ఇంక చెప్పేదేముంది- కూర్చుంటే వర్ణన- లేస్తే వర్ణన- నవ్వితే వర్ణన-

ఏడిస్తే వర్ణన- మాట్లాడితే వర్ణన- మౌనంగావుంటే వర్ణన- ఇంక ఇంక వర్ణించనిదే లేదనుకుంటాను.'

'అలాగా-' అని నవ్వుకుంటూ ఆమె రేగిన ముంగురులను సవరిస్తున్నాడు—

'శేషా ! మీవాళ్లు నీకు వేరే స్థిరపరచుతారామో!'

'స్థిరపరచనీ కుమార్ ! అలాగయితే వాళ్లు పెళ్లిచేసేది నాకు కాదు- నా ప్రాణంలేని శవానికి మాత్రమే !- అయినా కుమార్ ! ఇటువంటి ఆనందసమయంలో అటువంటి విచార మెందుకు ? చెప్పాను గా, బ్రహ్మదేవుడయినా నన్ను నీనుండి విడదీయలేడని- నీ వలపు వెన్నెల వన్నెకాంతిలో విహరిస్తాను- నీ మధురాధరోధిత సుధారస మంజుల మాధురీమహిమచే మత్తెక్కి- నీ కరపల్లవకౌగిట బంధింపబడి యీ విశాలప్రపంచాన్నే కాకుండా, నన్ను నేనే మరచిపోతాను. అప్పుడు నా హృదయంలో, దృష్టిలో, ఆలోచనలో, మాటలలో- నీవు. నీ మూర్తి- నీ కళ- నీ నామం తప్ప మరేమీ ఉండదు. సర్వస్వం నీవే ! అప్పుడు నీవే నేను- నేనే నీవు- తెలిసిందా ?' అంటూ ఆమె ఉద్రేకంలో అంటూంటే అతనికి మైకంగ్రమ్మి మరలా కౌగిలించుకుంటాడు.

'ఏమిటో భావకవిత్వం చెబుతున్నావు-'

'భావకవిగారి సంబంధం వట్టినేపోతుందా ?'

'వట్టినే యెందుకు పోతుంది- ఏలాగైనా కడుతుంది-'

'ఏమిటి ?'—

'భావగీతాలు.'

'చంపేశావు- అంతేకదా' అంటూ యిద్దరూ ఒకరిముఖంలోకి ఒకరు చూచుకొని నవ్వుకుంటారు.

'శేషా ! స్త్రీ, నవయౌవనవతి నగ్నసౌందర్యాన్ని చిత్రించాలని వుంది-'

'దానికేం! చిత్రించు- నీ కుంచె దిద్దలేని కళ అంటూ వుందా యీ ప్రకృతిలో-'

'కాని- ముందు ఒక్కసారి కన్నారాచూడాలనివుంది' అంటూ ఆమె నీవిపై చేయి వేస్తాడు- ఆమె చేయి విదలించి——

'ఛీ! పోదూ-'

'ఏం నేను కుక్క ననుకున్నావా ?'

'కాదు- పిల్లి వనుకున్నాను.'

'ఎందుకు ?'

'నా హృదయనవనీతాన్ని దొంగిలించినందుకు-'

'అబ్బో! పిట్ట కూతబట్టింది.'

'పాటకూడా పాడుతుందేమో-'

'ఆడుతుందికూడాను' అంటూ మెడలోని చిక్కుజెందిన హారాలు సవరిస్తాడు. అప్పటికి రాత్రి పండ్రెండు గంటలవుతుంది. వెన్నెల చాలులో ప్రకృతి మైమరచి నిద్రపోతుంది. రాకాసుధాకరుడు కిటికీలో నుంచి మన ప్రేయసీప్రియులను తొంగిచూడటానికి ముచ్చటపడు చున్నాడు. కొన్ని కిరణాలు వచ్చిరావటంతోనే ఆగిపోతున్నాయి, పూర్తిగా గదిలో ప్రవేశించకుండా!

'శేషా! చూడు- తారానాథుడు నిండుకళలతో నెంతకలకల లాడుతున్నాడో!'

'అవును- మనల్ని చూడటానికి వస్తున్నాడా అన్నట్లుంది-'

'మనలన్ జూడగ వచ్చుచుండె నదె రమ్యస్వర్గచంద్రుండు-'

'చూడు కుమార్! ఆ మనోహర నీలాల ఆకసమున చందమామ యెంత బాగున్నాడో!'

'ఆకాశంబున...'

'నీ పద్యాలుంటే తరువాతచూద్దాంగాని- చూడు పాపం! నీలమేఘాలు చంద్రుడు నెలా కప్పేస్తున్నాయో!'

'ఆకాశంబున నీలమేఘముల చాయావృత్తుడై -'

'కాదు- మనలను చూచి సిగ్గుపడి రోహిణీదేవితో మబ్బు తునకల తెరచాటుమాటునందు దాగుడుమూత లాడబోతున్నాడు గదా!'

'ఆకాశంబున నీలమేఘముల చాయావృత్తుడై వెల్గు నా
రాకేందుండును రోహిణీప్రణయపారావార మువ్వొంగగన్
వీకన్ దాగుడుమూతలాడ నదిగో వేంచేయుచున్నాడు సు
శ్లోకంబౌ తమప్రేమ నేడు మనకున్ సూత్రంబునా నొప్పగాన్'

'అబ్బా! ఎప్పుడూ కవిత్వమే! నీవు మాట్లాడితేనే కవిత్వ మవుతుంది. బిరుదు వట్టినే పోతుందా- వట్టినే యిచ్చారా?'

'అదంతా నా శేషారత్నం-గారి-మహిమ'

'గారి మహిమా లేదు- బూరి మహిమా లేదు. ఈపాటికి చాలించు-' అంటే యిద్దరూ ముసిముసి నవ్వులు నవ్వుకుంటారు. కొంచెం పరుషముగా నున్నప్పటికి వారి క్లిష్టసంభాషణ పానకంలో మిరియపుపొడిలాగ మనోజ్ఞంగానే వుంది. దగ్గరకు దీసికొని—

'శేషా! మన ప్రణయవివాహానికి ఆ జాబిల్లియే సాక్షి! అతనే మన వివాహం గావించేడు. న్యాయంగా మనకు పెండ్లి అవు తుందా- రోహిణీ చంద్రులులాగ మన మీా భూలోకంలో శేషా కుమారులం- అద్వితీయమైన అనురాగం అనుభవిస్తాం-'

'కాకపోతే—'

'కాకపోతేనా- త్రిమూర్తులు కలసి రోహిణీ చంద్రుల కిచ్చి నట్లే- మనకుకూడా ఒక నూతనలోకం సృష్టించి యిస్తారు. అలాగే మనమూ ఆచంద్రతారార్కం భూలోకవాసులకు ఆదర్శప్రాయుల

మాతాం' అని అతను ఉద్రేకంతో అంటుంటే, అతని జ్వలించే కన్నులు దివ్యతేజస్సును చూడలేక ఆమె కన్నులు మూసికొని అతని కంఠానికి తన బాహులతికలు పెనవైచి—

'కుమార్! నీ బిరుదుతోబాటు నాజన్మకూడ సార్థకమయింది. ఈనాటి మన ప్రణయగాథే ఒక గ్రంథ మవుతుందేమో!'

'అవును శేషా! మహత్తరమైన మహాకావ్య మవుతుంది' నీ అధరామృతపానమహిమచే నా కవిత్వానికి రసపుష్టి గలుగుతుంది. నీ చల్లటి చూపుతో శైలి ఏర్పడుతుంది. నీ పలుకుతో ప్రాణం లభిస్తుంది. నీ బిగికౌగిలిచే ఐక్యత చేకూరుతుంది. నీ ఆదరణలో- చైతన్యం- అనర్గళధార- భావశబలత- శబ్దార్థగాంభీర్యం- పదగుంభన- ప్రాప్తిస్తాయి- శేషా శేషా- నీ వెప్పుడూ యిలాగ నా సాన్నిధ్యంలో నుంటే- శారదాదేవిని దగ్గరపెట్టుకుని వాల్మీకి రామాయణం రచించినట్లు- నేనుకూడా మహాకావ్యాలు వ్రాస్తాను. అంతకన్న మహత్తరమైన ప్రేమగ్రంథాలు సృష్టిస్తాను—'

'అప్పుడు—' అనూయకంగా

'అప్పుడు- శేషా- అప్పుడు నేను కవికుమార్- కవిరాజు- నే కాకుండా కవిసామ్రాట్టు నౌతాను. శేషా- అప్పుడు- నీవే నా కావ్యజగద్రాణివి. నా 'కావ్యశ్రీ'ని నీ కరకమలములలో దాచుకుందువుగాని- శేషా! అప్పుడు—' అని అత నింకా ఏమేమో మహా ఉద్రేకంలో చెబుతూవుండగానే శేష తన్మయురాలై పరవశత్వ భారంతో—

'కవికుమార్- కుమార్‌కవి- కవికుమార్' అంటూ అతని గుండెలపైకి వ్రాలిపోతుంది. అతను మరి మాట్లాడకుండా ఆమెను లాలించి, బుజ్జగించి తృప్తిపరుస్తాడు. వారా ఆనందంతో అలసి

వెళ్ళిరా! అయినా యింకా వారంరోజులవరకూ నుంటానుగా! నీ వేమీ భయపడకు- నేనున్నానుగా-'

'సరే! నాకు భయమేమీలేదు! మన కిద్దరకూ పెండ్లిఅయితే బ్రతికి యిక్కడనే సుఖిస్తాను- లేకపోతే చచ్చి స్వర్గంలో నీతోనే సుఖిస్తాను- ఈ మాత్రం దానికి భయ మెందుకు?'

'అంతే! అది ప్రేమతత్వం! వీరాంగన లక్షణం; మరి వెళ్ళిరా! వెలుగుకూడా వస్తూంది.'

'వెళతాను- అయ్యో నిను వదిలి ఏలా వెళ్ళడం-'

'ఫరవాలేదులే- శేషా'

'ఈ వేణుగా డొకడు నా ప్రాణానికి చంపుతున్నాడు. అది మరీ భయంగా వుంది. ఏ అర్థరాత్రివేళ వచ్చి చంపుతాడో అని.'

'వాడి మొగం వాడికి భయపడట మెందుకు- వెళ్ళిరా' అంటూంటే శేష కదలిరానికాళ్లను బలవంతంగా నీడ్చుకుంటూ- బరువెక్కిన హృదయాన్ని పదిలపర్చుకుంటూ- విడిచిపెట్టని చేతిని విడిపించుకొని వెళ్లలేక వేళ్లలేక నెమ్మదిగా వెళ్ళిపోతుంది. అటు చూచే కన్నులనుమాత్రం త్రిప్పగలిగిందిగాని, మనసును త్రిప్పలేకపోయింది. కుమార్- ఆమె వెళ్లేవైపుకు చూస్తూ అలాగే నిలుచుండిపోయాడు, కనురెప్ప వేయకుండా! గాలి పీల్చే రాతిబొమ్మ లాగ...... సంయోగంలోని ఆనందం- వియోగంలోని విషాదం- రెండూకూడా అధికమైతే భరించటం కష్టమే అవుతుందేమో! కాని ప్రస్తుతం- కాల మెంత కరుణగలది!

శేష లోపలకుపోయి పడుకుంది. ఆ మత్తులో తలుపు వేయటం మర్చిపోయింది. వెంటనే నిద్రపట్టింది. ఇదంతా చూస్తున్న వేణు ఆగలేక ధైర్యంతో బయలుదేరేడు. సరాసరి లోపలకుపోయి శేష మంచంమీద కూర్చున్నాడు. మీద చేయి వేశాడు. ఆమె మాట్లాడ

వెళ్ళిరా! అయినా యింకా వారంరోజులవరకూ నుంటానుగా! నీ వేమీ భయపడకు- నేనున్నానుగా-'

'సరే! నాకు భయమేమీలేదు! మన కిద్దరకూ పెండ్లిఅయితే బ్రతికి యిక్కడనే సుఖిస్తాను- లేకపోతే చచ్చి స్వర్గంలో నీతోనే సుఖిస్తాను- ఈ మాత్రం దానికి భయ మెందుకు?'

'అంతే! అది ప్రేమతత్వం! వీరాంగన లక్షణం; మరి వెళ్ళిరా! వెలుగుకూడా వస్తూంది.'

'వెళతాను- అయ్యో నిను వదిలి ఏలా వెళ్ళడం-'

'ఫరవాలేదులే- శేషా'

'ఈవేణుగా డొకడు నా ప్రాణానికి చంపుతున్నాడు. అది మరీ భయంగా వుంది. ఏ అర్థరాత్రివేళ వచ్చి చంపుతాడో అని.'

'వాడి మొగం వాడికి భయపడట మెందుకు- వెళ్ళిరా' అంటూంటే శేష కదలిరానికాళ్లను బలవంతంగా నీడ్చుకుంటూ- బరువెక్కిన హృదయాన్ని పదిలపర్చుకుంటూ- విడిచిపెట్టని చేతిని విడిపించుకొని వెళ్లలేక వేళ్లలేక నెమ్మదిగా వెళ్ళిపోతుంది. అటు చూచే కన్నులనుమాత్రం త్రిప్పగలిగిందిగాని, మనసును త్రిప్పలేకపోయింది. కుమార్- ఆమె వెళ్లేవైపుకు చూస్తూ అలాగే నిలుచుండిపోయాడు, కనురెప్ప వేయకుండా! గాలి పీల్చే రాతిబొమ్మ లాగ...... సంయోగంలోని ఆనందం- వియోగంలోని విషాదం- రెండూకూడా అధికమైతే భరించటం కష్టమే అవుతుందేమో! కాని ప్రస్తుతం- కాల మెంత కరుణగలది!

శేష లోపలకుపోయి పడుకుంది. ఆ మత్తులో తలుపు వేయటం మర్చిపోయింది. వెంటనే నిద్రపట్టింది. ఇదంతా చూస్తున్న వేణు ఆగలేక ధైర్యంతో బయలుదేరేడు. సరాసరి లోపలకుపోయి శేష మంచంమీద కూర్చున్నాడు. మీద చేయి వేశాడు. ఆమె మాట్లాడ

లేసు- ఆమెను తనచేతిలోకి తీసుకోబోయాడు. 'కుమార్ ! నీకు నేనంటే యెంత ప్రేమ' అని కలవరించింది. అసలే అసూయాగ్నితో కుమిలిపోతూన్న అతని హృదయం భగ్గున మండిపోయింది. పశుబలం అతని రాక్షసత్వాన్ని బలపరచింది.

'శేషా-' అని గద్దించాడు. ఆ కేకతో ఉదరిపడి లేచింది. వేణుని చూచింది. యెదురు డనుకుంది. గజగజ వణికిపోతూంది. కాని కొంతసేపటికి సర్దుకొని- ధైర్యం తెచ్చుకొని బెట్టుసరిగా—

'ఊ- ఎందుకొచ్చావు ?'

'ఎందుకొస్తానో తెలియదా ?'

'తెలియదు-'

'నీ వెందుకెళ్లేవు వాడి దగ్గరకు-' మొదట శేష తెల్లబోయినా తప్పనిసరిగా మొండిధైర్యం తెచ్చుకొని—

'అది నా యిష్టం-'

'ఇది నా యిష్టం-'

'నీ యిష్టాన్ని అంగీకరించేవాళ్లెవరూ లేరిక్కడ-'

'ఇక్కడ వున్నవాళ్లే అంగీకరిస్తారు'

'అంగీకరించరు-'

'అంగీకరించితీరాలి'

'వీల్లేదు—'

'వల్లకాదు—'

క్రమంగా వాళ్ల సంభాషణ ముదిరిపోయి, వేణు బలవంతంగా పట్టుకోబోయాడు. శేష కొంతసేపు వాడితో పెనుగులాడింది. అలసిపోయింది. ఇక చేసేదేమీ లేక 'లక్ష్మీ- లక్ష్మీ' అని కేకలుపెట్టింది. వేణు భయపడ్డాడు. మరలా యిది రెండవసారి అవమానమవుతుం దేమోనని- ఇప్పటికే అతను సగముచచ్చి బ్రతుకుచున్నాడు. లక్ష్మి

లేచి వస్తోంది. ఇక లాభంలేదని వేణు పలాయనమంత్రం పఠించాడు. ఆకంగారులో దబ్బరోలుమీద పడ్డాడు. నొసలు పగిలింది. చేతితో తడుముకున్నాడు. రక్తమయం- గదిలోకి వెళ్లి చూచేడు. విద్యుత్ దీపపు వెలుతురులో రక్తముతో తడిచిన అతని చేతులు మొకసి పోయాయి. ఆ రక్తాన్ని చూడలేక పిచ్చివాడైపోయాడు. బుర్ర తిరిగి పోయింది. కళ్లు చీకట్లు గ్రమ్మాయి. అతని ఆత్మ ప్రతీకారంకోసం పలవరిస్తోంది. నిశ్చయించుకున్నాడు- ఏమిటా నిశ్చయం?—

'ఇక శేషా కుమారులు కలుసుకోకుండాచేయాలి! శేష జీవిత మెలాగయినా వ్యర్థంచేయాలి! శేషను నాశనంచేయాలి-' అది అతని తుది నిశ్చయం. ఆ నిశ్చయాన్నే ప్రతిజ్ఞగా మార్చుకున్నాడు- ఒట్టు పెట్టుకున్నాడు. అలాచేయనినాడు తాను తల్లిని గోరిన పాపము పొందుతాడట—

ఎంత దారుణం! తానంటే యిష్టంలేని స్త్రీని బలవంతపెట్టి అంగీకరించకపోతే ఆమెను నాశనంచేయాలా? ఇదియేనా ధర్మం- ఇదేనా న్యాయం- ప్రపంచ సౌభ్రాతృత్వ మిదేనా? ఇదేనా మానవుని జీవితాదర్శం- ఎంత నీచము- ఎంత హేయము—

అయితే వేణు ప్రతిజ్ఞలు చెల్లించుకోగలడా? ఓడిపోతాడా? ఉడుకు చల్లారేక ఊరుకుంటాడా? వేణు ఊరుకున్నా కుమార్ నాశనానికై కంకణంకట్టుకున్నా చిట్టమ్మ ఊరుకుంటుందా? ఊరుకోగలదా? ఏమో! అది స్త్రీ హృదయం- పైగా పరాభవాగ్నితో ప్రజ్వలిస్తోంది- ఎప్పుడు భగ్గుమండి అంటుకుంటుందో!

అయితే వేణు, చిట్టమ్మల ఆశయాలు, ఆదర్శాలు ఒకటే! ఇప్పుడు యిద్దరూ ఏకమౌతారా? అయితే వాళ్ల బలం రెట్టిస్తుంది. ఏకమైతే శేషా కుమారుల నాశనం తప్పదా? కుమారుని తెలివి

తేటలు- దాసు ఉక్తి, శక్తి- శేష పవిత్రప్రేమ నుంటగలసిపోవల సిందేనా? దీని పరిణామం ఏలా ప్రతిఫలిస్తుంది? దాని ప్రతిఫల మేమిటి?

* వేణూ, చిట్టెమ్మలు ఏకమౌతారా?
* శేషా, కుమారుల నాశనంచేస్తారా?
* పవిత్రప్రేమ జయిస్తుందా?
* భగ్నహృదయాలకు శాంతి యెప్పుడు?
* అసూయాగ్రస్తులు యేంచేస్తారు?
* ప్రేమజీవు లేమవుతారు?
* పర్యవసాన మేమవుతుంది?
* 'ప్రతిఫల' మేమిటి?

మొదలైన ప్రశ్నలు మిమ్మల్ని బాధపెడతాయి. అటువంటి వాని కన్నిటికి అసలైన సమాధానం కావాలంటే కవికుమార్- రెండవభాగము చదవండి!

మరి- సెలవు——

నమస్తే!

—(o)—

శ్రీ భుజంగరాడ్ ముద్రాక్షరశాల, జగన్నాధపురం, కాకినాడ.

## "కావ్యశ్రీ" కళాఖండము.

# ★ ప్రతిఫలం ★

[ సాంఘిక డ్రామా ]

రాజకీయంలోని రంతు- సంఘంలోని రంగు- బట్టవిప్పి బయట పెట్టి- కన్నులకట్టేటట్లు కనపర్చే సాటిలేని మేటి నాటకరాజము—. అనల్ప కల్పనా శిల్పముతో—అప్రతిహత ప్రతిభా- ప్రభాసిత- ప్రసంగాలతో— మరుపురాని మురిపాల మాటలతో— ముద్దులమూటలు గట్టే పద్యాలతో— హృదయాలు కరిగి ద్రవించే కమ్మని పాటలతో— అనుకోని సంఘటనలతో—ఊహించరాని కథాకథనముతో—ముఖ్యంగా- కడుపుచెక్కలుచేసి కమ్మనిభోజనంపెట్టే సున్నిత హాస్యంతో— అడుగడుగునా సంభ్రమాశ్చర్య దిగ్భ్రమలతో స్తంభింపచేసే రచనా కౌశలము—.

బురఖారాయుళ్ళ బూటకాల్లోపడి యదార్థవాదులు వ్యగ్రమైన అనర్థాన్ని అనుభవిస్తున్నారు. కమ్యూనిస్టులు లోకాన్ని కొల్లగొడుతున్నారు—. ఉద్యోగులు ధనవంతులతో కలసి దురంత కార్యాలు జరిపిస్తున్నారు—. ప్రభుత్వోద్యోగులే- పరదారధనాదులగోరి ప్రభుత్వము కన్నులలో కారం జల్లుచున్నారు. మధ్య- అభం శుభం ఎరుగని అమాయకులు క్రుంగి కృశించి నశించి నాశనమైపోతున్నారు. ఇది రాజకీయం.

ప్రతిఫలమందక పగగామారిన స్త్రీపరాభవాగ్నిలోబడి మహాసత్వంగల పురుషుడు బూడిదయైపోతున్నాడు. స్త్రీ తనను తిరస్కరించినవ్యక్తి తన ప్రణయహృదయంతో సలిగిపోతూంటే- ఆ స్త్రీ తన యినపకాళ్ళతో వానిహృదయముపై నడచుచు-వాని కార్చే కన్నీటితో కాళ్ళుకడుగుకొంటూ- విజయ గర్వంతో-కటువుగా-వెగటుగా-వెర్రిగా నవ్వుతోంది. ఇది సాంఘికం—.

ఈ రెంటిని జోడించి నాటకాలకు మేటిగా స్టేజికి సూత్రాలంకారముగా తయారుచేయబడిన "ప్రతిఫలం"

వెల:—1-4-0

రచయిత—"కావ్యశ్రీ"